# త్యాగధనుడు

శ్రీ నల్లపాటి హనుమంతరావుగారి
స్వీయచరిత్ర

సేకరణ

డాక్టరు గూడూరి నమశ్శివాయ

ప్రకాశకులు
గాంధీ సాహిత్య ప్రచురణాలయం
గాంధీ జ్ఞానమందిర్ - సుల్తాన్ బజార్
హైదరాబాదు - 500 001

# ప్రకాశకుల నివేదన

గాంధీ మహాత్ముడు భారత రాజకీయ రంగంలో ప్రవేశించక ముందే అనేక మంది ఆంధ్ర మహాపురుషులు వివిధ నిర్మాణ కార్యక్షేత్రాలలో నిమగ్నులై సేవచేశారు. బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలను నెలకొల్పిన స్వర్గీయ కోపల్లె హనుమంతరావు గారి వంటి మహనీయులు ఎంతోమంది ఆంధ్ర దేశంలో ఉన్నారు. అట్టి మహనీయులు ఆంధ్రలోకానికి నిరంతరం జ్ఞప్తి ఉండేలాగున వారి జీవితాలను ప్రచురించవలెనని గాంధీ సాహిత్య ప్రచురణాలయము సంకల్పించింది.

అస్పృశ్యతా నివారణ, హరిజన సేవా రంగాలలో గాంధీజీ ఆదేశానికి ముందే తీవ్రమైన కృషిసల్పిన మహనీయులలో స్వర్గయులు శ్రీ వేమూరి రాంజీరావు, గూడూరి రామచంద్రుడు గార్లూ, శ్రీ నల్లపాటి హనుమంతురావు గారూ ముఖ్యులు. వీరి జీవిత చరిత్రలను ప్రచురించవలెనని ఎన్నాళ్లుగానో ప్రచురణాలయము అనుకొంటున్నది. ఇప్పుడు మాకీ సదవకాశానికి కారణ భూతులు పూజ్యులు శ్రీ గూడూరు నమశ్శివాయగారు. వీరు వేమూరి రాంజీరావు, గూడూరు రామచంద్రుడు గార్ల జీవిత వృత్తాంతాలను సేకరించి గ్రంథాలను రచించారు. శ్రీ హనుమంతరావుగారి చరిత్రను వారితోనే వ్రాయించారు. అందుకని ఈ మూడు జీవిత సంగ్రహాలను రెండుగా ప్రచురించవలసి వచ్చినది. మాకీ సదవకాశాన్ని కలుగజేసిన శ్రీ గూడూరి నమశ్శివాయగారి మేలు మరువరానిది వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములను సమర్పిస్తున్నాము. ఈ పుస్తకాలకు అలంకార ప్రాయమైన పీఠికను ప్రఖ్యాత రచయితలు, చరిత్ర

కారులునయిన శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు వ్రాశారు. వారికి మా వినయపూర్వక నమస్సులు. ఈ పుస్తకాలను సకాలంలో చక్కగా ముద్రించి యిచ్చిన సర్వోదయ ప్రచురణాలయ కార్యకర్తలకు, ముఖ్యంగా శ్రీ పాతూరి నాగభూషణం గారికి మా కృతజ్ఞత.

ముమ్ముందు కూడా ఇట్టి త్యాగధనులైన మహనీయులను ఆంధ్ర పాఠకలోకానికి పరిచయం చేసే భాగ్యం మాకు ఇతోధికంగా లభించగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు

కోదాటి నారాయణరావు

కార్యదర్శి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

గాంధీ జ్ఞానమందిరం,
హైదరాబాదు
1 - 11 - 83

# పీఠిక

ఇది ఆంధ్రదేశంలోని అట్టడుగు కులాలవారైన మాలమాదిగల నుద్ధరించిన పరోపకార పారీణులైన ఇద్దరు తెలుగు వారిజీవిత కథలసంకలనము. దీనిని రచించినవారు బెజవాడలో సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, సాహిత్యవేత్తమైన శ్రీ గూడూరి నమశ్శివాయగారు.

పుస్తకం చిన్నదైనా ఆంధ్రదేశ సాంఘిక చరిత్ర రచనకు అమూల్యమైనది. ప్రపంచవిఖ్యాతి చెందిన హిందూమత ధర్మాలను కలుషితంచేసిన అస్పృశ్యతా సమస్య చరిత్రలో ఒక ముఖ్యఘట్టమును వివరించే గ్రంథమిది.

పాశ్చాత్య నాగరిక దేశాలవారికి మనదేశంలో కనబడే వింతలలో బహుదేవతారాధనము, నీతి మతధర్మాల ఆచరణలో పాటించే కుల తారతమ్యాలు, అస్పృశ్యతా విధానము ముఖ్యమైనవి.

మన దురదృష్టమువల్ల యీ అస్పృశ్యతా సమస్య విపరీత రూపము దాల్చినది. మనదేశంలోని బ్రాహ్మణ, బ్రాహ్మణేతర కులాలవారందరూ అట్టడుగు కులాలవారైన మాలమాదిగలను అస్పృశ్యులుగా పరిగణించి, వారికి సామాన్యమానవుల సౌకర్యాలు లేకుండాచేసి, గ్రామాల వెలుపల మాలమాదిగ గూడెములలో కాలక్షేపముచేసే ఏర్పాట్లు చేసినందువల్ల, వారిని గ్రామబావులలో నీరుతోడుకోనివ్వక పోయినందువల్ల, మాలమాదిగలుకూడ ఒకరి బావినీరు ఒకరు తాగనందువల్ల గ్రామాల లో పశువులను కడిగి బట్టలు ఉతికే చెరువులలోగాని, గుంటలలోకాని ఉండే అపరిశుభ్రమైన నీటి నుపయోగింపవలసి వచ్చేది. ధర్మాత్ములెవరైనా ఒక భావి త్రవ్విస్తే కద్దు, లేకపోతే లేదు. ధర్మాత్ములు తమ భావులలోనుండి నీటిని పోస్తేకద్దు, లేకపోతేలేదు. తాగటానికే నీరు లేనప్పుడు స్నానాని కెక్కడి నుండి వస్తుంది? అందువల్ల శుచిశుభ్రత లుండేదానికి అవకాశంలేదు.

మాలమాదిగలు లేనిది రైతులకు ఒక్కక్షణం గడవదు. వ్యవసాయంలో గడ్డివిరవడం మొదలైన మోటుపనులన్నియువారుచేయవలసినదే

వారికి తగిన జీవనభృతి యివ్వడంలో కొందరుమాత్రమే న్యాయంగా యిచ్చేవారుగాని చాలామంది బహుస్వల్పంగా యిచ్చేవారు.

మాలజాతివారికన్న మాదిగజాతివారు ఎక్కువ బాధపడవలసి వచ్చేది. దానికి కారణం వారు చచ్చినగొడ్లను తీసుకొనిపోయి తోళ్ళని చేయవలసి రావడంవల్ల వారి గూడెములు చాలా అపరిశుభ్రంగా ఉండేవి. అయితే మాలలు మాదిగలు కూడ ఒకరికన్న ఒకరు ఎక్కువనే వాగ్వివాదాలలో పడేవారు.

మాలలు చాలామంది రామభక్తులుగానుండి వైష్ణవసంప్రదాయంలో ఉండేవారు. మాదిగలు శివభక్తులుగా నుండేవారు. వారికి జంగాలు గురువులు. అందువల్లకూడా మాలమాదిగలలో సామరస్యము లేదు. అనేక కారణాలవల్ల ఎంతో వెనుకబడివున్న మాలమాదిగలలో ఆశ్చర్యకరమైన సంగతి ఉభయులలోను మాలదాసులు, మాదిగదాసు అనేవారు వైష్ణవ మతాచారాలను పాటిస్తూ, పౌరోహిత్యము వహిస్తూ, వైద్యముకూడా చేస్తూ, శ్లోకాలు దండకాలు మొదలైనవి పఠిస్తూ ఉండడం; వాళ్లలో కొందరు అక్షరజ్ఞానం కూడ కలిగి వుండడం.

మాలమాదిగలలో సామాన్యులకు చదువుకునే అవకాశాలు లేనందు వల్ల వారు అజ్ఞానంలోనే మునిగి వుండేవారు. కాని వాళ్లలోని పెద్దలు మన పురాణ కథలను వేదాంతమును ఎరిగి వుండి నందువల్ల ఆ కులాలలో నీతి ధర్మాలు ఉండేవి. అందువల్లనే ఎన్నో విధములైన అపకార్యాలు కలిగినా వాళ్లు సహించి హిందువులుగానే ఉంటూ వచ్చారు.

నేటి వర్గవైరాల భావాలు ఆనాడు లేవు. కర్మ పునర్జన్మను నమ్మి వైరాగ్య భావం కలిగి వుండేవారు. మన దేశానికి వచ్చి, మనకు ప్రభువులైన ఇంగ్లీషు వారి పరిపాలనలో పాశ్చాత్య క్రైస్తవ మత బోధకులు తమ ప్రచారం సాగించి ప్రజలను తమ మతంలో కలుపుకోటానికి ప్రయత్నిస్తూ మన మత ధర్మాల్ని దూషించడంతో పాటు, యీ అస్పృశ్యతా సమస్యను కూడా ఉపయోగించుకునేవారు. వారు మన సాంఘికాచారాలను విమర్శిస్తూ, దేశంలోని ఉన్నత కులాల

వారు మాలమాదిగలను నీచంగా చూస్తున్నారనే విషయాన్ని నొక్కిచెప్పి, మాలమాదిగల మనస్సులు విరచి, వారిలో కొందరిని తమమతంలో కలుపుకో చూచారు. వారి ప్రయత్నం కొంత ఫలించినది కాని అధిక సంఖ్యాకులు హిందువులుగానే ఉండిపోయారు.

మన పరిపాలకులైన ఇంగ్లీషువారు మనకు రాజకీయ స్వాతంత్ర్యము యివ్వడానికి యిష్టములేక మనలో గల జాతి, మత, కులభేదాలు అందుకు ఆటంకములని చెబుతూ మిత్రభేధ విధానము ఐవలంబించి, హిందూ- మహమ్మదీయుల మధ్యనేగాక, బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల మధ్యను, బ్రాహ్మణేతరకులాలకు అట్టడుగు కులాలైన మాల మాదిగల మధ్యను వైరములు కల్పించి, 1947 వసం. వరకు కాలహరణంచేసి తుదకు మనలను వదలి వెళ్ళినారు.

1950 సంవత్సరంలో అమలులోకివచ్చిన స్వతంత్ర భారత రాజ్యాంగంలో పౌరులందరూ సమానులనే సిద్ధాంతము ప్రకారం అస్పృశ్యత రద్దుచేయబడి అందరికీ జాతిమత కుల తారతమ్యాలు లేకుండా న్యాయము జరిగించే విధి నిషేదాలు శాసించబడినవి.

మనదేశము స్వతంత్రమై35 సం. లైనది. అస్పృశ్యత రద్దు చేయబడినది. అట్టడుగు నిమ్నజాతుల అభివృద్ధికోసం, రక్షణకోసం అనేక సౌకర్యాలు కల్పించబడినవి. కోట్లకొలది రూపాయలు ఖర్చయినవి.కొంత అభివృద్ధికూడ జరిగినది కాని యిది ఖర్చుకుతగినట్లుగా లేదు. అనేకమంది మాలమాదిగలు శాసనసభ్యులుగా, పార్లమెంటు సభ్యులుగా, మంత్రులుగా ఉన్నారు. వారు భాగ్యభోగ్యాలతో తులతూగుతున్నారు. వారి బంధువులు సుఖపడుచున్నారు. నిజమే, కాని నోరులేని పేదసాదలైన మాల మాదిగల స్థితి చక్కబడలేదు. వారికి చెందవలసిన సౌకర్యాలు అందుబాటులో లేవు.

ఈ దుస్థితికి ముఖ్యమైన కారణము మాల మాదిగల నాయకులలో అంబేద్కరు వంటి స్వార్థ త్యాగులు, నీతిపరులు కరువై పోవడమే అని చెబితే చాల మందికి కష్టంగా తోస్తుంది.

మనకు స్వాతంత్ర్యములేక రాజకీయార్థికవిషయాలలో దేశప్రజలందరికీ అసౌకర్యాలున్న కాలంలో యీ అట్టడుగు కులాలవారి దుఃస్థితి దుర్భరంగా నుండే దనడానికి సందేహం లేదు. వారి బాధలను తీర్చేవారెవరు? కేవలం పరమార్థ చింతతో, పరోపకారము చేయదలచిన త్యాగధనులు తప్ప, అటువంటి సత్కార్యమునకు నడుముకట్టేవా రెవరు? అని ఆలోచిస్తే, హరిజనోద్ధరణకు పూనుకొన్న గాంధి మహాత్ముని యొక్క పారమార్థికచింతను అర్థం చేసుకోవచ్చును. మహాత్ముని హరిజనోద్ధరణను గూర్చి అందరు ఎరుగుదురు. దాని ఫలితముగానే మన మాలమాదిగలకు, దేశంలోని వివిధ ప్రాంతాలలోగల అస్పృశ్యులకు సేవచేసి ఉద్ధరించే సంఘాలు ఏర్పడినవి. అందులో బ్రాహ్మణ, బ్రాహ్మణేతర దేశభక్తులు పాల్గొన్నారు. దాని ఫలితంగానే రాజ్యాంగంలో అస్పృశ్యులకు న్యాయం చేకూరినది. ఈ సంగతి కూడా చాల మంది ఎరుగుదురు. కాని మహాత్ముడు పూనుకొనక పూర్వమే యిటువంటి కృషి చేసిన సత్పురుషులు కొందరున్నారనే సంగతి చాల మందికి తెలియదు. వారి జీవిత వివరాలుగాని, వారు సాధించిన కార్యాలుగాని అసలే తెలియవు. దానిని గూర్చి స్మరించుటకే యీ చిన్న గ్రంథ ముద్దేశింపబడినది. మాల మాదిగల స్థితి గతులు వివరించే గ్రంథము శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి' ఒకటే ఉన్నది.

ఈనాడు శాసన సభలలో జరిగే చర్చలలో కుల మాదిగలతోపాటు వారి కేర్పడిన సౌకర్యాల వంటి వానిని తమకు కూడ కావలెనని వివిద బ్రాహ్మణేతర కులాల వారిలో కలుగుతూవున్న కాంక్ష, దానిని పురస్కరించుకొని ఉన్నత కులాలవారు కూడా తమ్ము వెనుకబడిన కులాలలో చేర్చమని ఆందోళన ప్రారంభించడము కనబడుతున్నది.

ప్రజాప్రభుత్వంలో శాసన సభ్యుల జీతభత్యములు హెచ్చు చేయమని కోరుతూ వుండడము కొందరాక్షేపించవచ్చును. నిమ్నజాతి ప్రతినిధులు కూడా తమ కులాలవారి కేర్పడిన సౌకర్యములను శాశ్వత బ్రహ్మకల్పముగా నుండాలని కోరుతూ వుండడం కూడ యిటువంటిదే. మనదేశ దురదృష్టంవల్ల యిలాగ కోరుతున్న శాసన సభ్యులు, మంత్రులు అట్టడుగు కులాలలో పేదసాదల క్షేమలాభాల కోసం చేస్తున్న కృషి మాత్రము

శూన్యంగా నున్నది. వారు స్వయంగా చేసే సేవలో చాలా అవక తవక లున్నవి.

మన ఆంధ్రదేశంలో వివిధ జిల్లాలలో నున్న మాల మాదిగల జనాభాలో సగముకన్న ఎక్కువ సంఖ్య గలవారు మాదిగలైవున్నా వారి కంటె మాలకులం వారికి ఎక్కువ ప్రాతినిధ్యము, పలుకుబడి, సౌకర్యాలు ఏర్పడినవని యిటీవల మాదిగ కులనాయకులు సభలు చేసి ఆందోళనలు చేస్తున్నారు. ఈ సమస్య ఇంత వరకు పరిష్కరించ బడలేదు.

మాలమాదిగలలోనే చాలా భేదాలున్నవి. ముఖ్యంగా పూర్వము అస్పృశ్యులలో అస్పృశ్యులుగా పరిగణింపబడేవారు కొందరున్నారనే సంగతి చరిత్ర పరిశోధకులకు తెలిసిన విషయమే. కాని యీనాడు వారిని గూర్చి పత్రికలలోగాని, శాసన సభలలో గాని ప్రకటింపబడడం లేదు. వారిగతి ఏమైనదో ఎవ్వరికి తెలియడంలేదు. మన దేశంలో జనాభా లెక్కలలోగాని, యితర ప్రభుత్వ నివేదికలలోగాని అట్టడుగు కులాలలోని పేదసాదలను గూర్చిన వివరాలు కనబడడంలేదు. దానిని గూర్చిన విచారణ చాలా అవసరం.

1961 వసం. లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి ఆధ్వర్యం క్రింద జరిగిన యత్నలాజికల్ సర్వే (Ethnological Field Survey)లో తెలుగు దేశంలో కోస్తాజిల్లాలలోను, రాయలసీమలోను కలెక్టరుల పర్యవేక్షణ క్రింద జరిగిన విచారణలో మాలమాదిగలలో యల్లమ్మ దేవతకు అంకితం చేయబడిన మాతంగులనే అవివాహిత స్త్రీలు ఉన్నారనీ, వీరికి జన్మించే ఆడపిల్లలు మాతంగి స్త్రీలుగానే ఉండి గ్రామదేవత జాతర్లలో పాల్గొంటారనిన్నీ, మగపిల్లలు మాలమాదిగ కులాలలో కలిసి పోతారనిన్నీ కోస్తా రాయలసీమలలో కలిపి 392 మంది మాతంగి స్త్రీలు, 250 మంది మాతంగి పురుషులు జనాభా ఉన్నట్లు తేలినది. తెలంగాణాలో ఫీల్డు సర్వే జరగలేదు. పైన చెప్పిన నివేదికలో యీ మాతంగుల యొక్క కులాచారాలు వివరింపబడినవి. మాతంగి అనే స్త్రీ యల్లమ్మదేవత అవతారంగా ఎంచుతారు. ఈ స్త్రీ జరిపించే తుడుపులవల్ల పిశాచి బాధలు, ఇతర

బాధలు తొలగి పోతాయని, మాలమాదిగలే గాక యితర కులాలవారుకూడా తపస్సులు చేయించుకుంటారని చెప్పబడింది.

ఆంధ్రదేశంలోనే గాక భారతదేశ మంతటా అతి ప్రాచీన కాలం నుండి హిందూమత ధర్మాలకు ఆధారభూతులైనవారు బ్రాహ్మణులేయనే భావము వ్యాపించి యున్నది. మన కుల వ్యవస్థకూడా వారివల్లే ఉత్పత్తి యైనదని చరిత్రకారుల అభిప్రాయము. జాతి, మత, కుల తారతమ్యాలు బ్రాహ్మణాదిస్మృతి అన్ని ధర్మశాస్త్రాలలోను చెప్పబడినది. నిజానికి కుల తారతమ్యాలనేవి మన దేశంలోనేగాక యితర దేశాలలో కూడ ఉన్నవి. కులాధిక్యతను గూర్చిన భావాలు బ్రాహ్మణులనేగాక, బ్రాహ్మణేతరులలో కూడ వ్యాపించి యున్నవి. కులభేదంలో తప్పులేదుగాని, కుల తారతమ్యాల వల్ల మాత్రం మన దేశానికి నష్టం జరిగిన మాట నిజం. అయితే యీ నష్టమునకు కేవలం బ్రాహ్మణులొక్కరే కాదు, బ్రాహ్మణేతరులు కూడా దీనికి బాధ్యులనే సంగతి చరిత్రవల్ల తెలుస్తుంది. ఒకరి కన్న ఒకరు శ్రేష్ఠులనే భావము అభివృద్ధి చెందినందువల్లనే యీ దుఃస్థితి సంభవించినది.

ఇటీవల ఈ విధమైన కులాధిక్యతా భావములు చాలవరకు తగ్గుతున్నవి. ఒక కాలంలో యివి చాల తీవ్రరూపంలో ఉండేవి. ఆసమయంలో బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని కులాచారాలకు భిన్నంగా ప్రవర్తిస్తే ఆయా కులాలవారు సహించేవారుకారు. అట్లా ప్రవర్తించే వారిని వెలివేసి బాధించేవారు.

ఒక వంక బ్రాహ్మణేతరోద్యమంలో బ్రాహ్మణ దూషణము తీవ్రంగా జరుగుతుండగా, యింకొక వంక బ్రాహ్మణాచారాలను ఉల్లంఘించి మాలమాదిగల సేవ చేసినందులకు బ్రాహ్మణకులంవారివల్ల నానా బాధలకు లోనై మాలమాదిగల నుద్ధరించుటకు ఎన్నో విధాలుగా కృషిచేసి కృతకృత్యులైన ధన్యజీవులలో నల్లపాటి హనుమంతరావుగారు, గూడూరి రామచంద్రుడుగారు, వేమూరి రాంజీరావుగారు అగ్రగణ్యులు. వారు చేసిన కృషి యొక్క విలువను గూర్చి స్మరించుట కేర్పడిన గ్రంథమిది.

హైదరాబాదు — దిగవల్లి వేంకటశివరావు
14 - 10 - 1983



శ్రీ నల్లపాటి హనుమంతరావుగారు

# శ్రీ నల్లపాటి హనుమంతరావు
## స్వీయ చరిత్ర

గౌతమగోత్రజులైన నల్లపాటివారు ఆర్వేల నియోగులు. పూర్వమునుండీ అసలు నల్లపాటివారి నివాసము గుంటూరు సమీపములోని నల్లపాడు గ్రామం. వీరు ఆగ్రామానికి కరణములుగా ఉండేవారు. ఈ వంగడమునందలి ఒకశాఖ నల్లపాడుకు దగ్గరగానున్న యంగళాయపాలెము నకు తరలివెళ్ళారు. వారు ఇప్పటికీ పెద్దకుటుంబమువారే. నల్లపాడులో నున్నవారు నల్లపాటివారే.

నల్లపాటి రమణరాజు అనువారు నాకు తెలిసినంతలో మా మూలపురుషుడని చెప్పాలి. ఆయన కుమారుడు కృష్ణంరాజుగారు. వారికి సుబ్బరాజుగారు ఒక్కరే కుమారుడు. ఈ సుబ్బరాజుగారికి అయిదుగురు కుమారులు కోటయ్య, వెంకటప్పయ్య, నాగరాజు, నరసింహాము. రామదాసు అనువారు.

నాల్గవ కుమారుడైన నరసింహాముగారికి నేనొక్కడనే కుమారుడను. నా పేరు నల్లపాటి హనుమంతరావు.

మా మూలపురుషుడు రమణరాజుగారని చెప్పాను. ఆయన వాసిరెడ్డి రామన్నగారనే జమీందారుగారికి యేమి సహాయం చేశారో యేమో తెలియదుగాని వారివల్ల గుంటూరుకు సమీపానగల లాల్‌పురంలో 27 ఎకరాల భూమిని ఈనాముగా పొందారు. లింగాయపాలెంగ్రామంలో

30 ఎకరాల విస్తీర్ణముగల చెరువును బహుమతిగా యిచ్చారు. ఈ యీనాముమీద వచ్చే ఆదాయముతో ఆ చెరువును మరమ్మతులలో ఉంచవలెనని యేర్పాటు. ఆయీనాము చెరువు ఇప్పటికీ నల్లపాటివారి అజమాయిషీలోనే ఉన్నది. దానికి నల్లపాటివారే ధర్మకర్తలుగా ఉన్నారు. ఆచెరువులో 8 ఎకరములలో మాత్రం నీరు నిలచును. మిగతాది అంతా ఖాళీగానే ఉంటోంది. మేమే ఆచెరువుకు మరమ్మతులు వగైరా చేయించుచున్నాము.

మా తాతగారైన నల్లపాటి సుబ్బరాజుగారు వారి మాతామహస్థానమైన మంగళగిరివద్దనున్న నౌలూరు గ్రామానికి తరలివచ్చారు. తాతగారికి మగసంతతి లేనందున దౌహిత్రుణ్ణి తీసికొని వచ్చి కరణీకాన్ని అప్పగించి స్థిర నివాసంగానే నౌలూరులో యేర్పాటు చేశారు.

పూర్వం వానలు బొత్తిగా లేక పంటలు సరిగా పండక కరువులు తటస్థిస్తూ ఉండేవి. అతివృష్టి అనావృష్టులతోపాటు కృష్ణానది వరదలు ఆ ఊరి పొలాలన్నింటినీ ముంచెత్తుతూ ఉండేవి. అందువల్ల భూములవల్ల జీవనాధారమునకు కొరత యేర్పడిన కారణంగా నరసింహము, రామదాసు గార్లు పోలీసుశాఖలో ఉద్యోగులుగా చేరి జీవనం గడుపుకున్నారు.

చాలా ప్రాచీనమైన పుణ్యక్షేత్రాలలో మంగళగిరి ఒకటి. దీనికి మంగళాద్రి, తోతాద్రి అని కూడా పేర్లు కలవు. ఇది ప్రాచీనమైన ఇంద్రదేవాలయమని పెద్దలు చెప్పగా విన్నాను. ఉత్తరదేశంలో దీని ప్రసిద్ధి యెక్కువ. కొండ మీద పానకాలస్వామివారి, కొండక్రింద శ్రీ లక్ష్మీనర

సింహ స్వామివారి ఆలయాలున్నవి. నా చిన్నతనంలో రోజూ వందలాది ఉత్తరాదియాత్రికులు వస్తూ ఉండేవారు. మన మెంత పానకము చేయించినా పానకాల స్వామి అందులో సగము మాత్రమే స్వీకరిస్తాడు. సగము త్రాగిన వెంటనే బొళుక్కుమని ధ్వని వినపడుతుంది. అంతట పానకం పోయుట ఆపివేస్తారు. లేనిచో అంతా బయటకు వస్తుంది. విచిత్రమేమనగా పుట్లకు పుట్లు బెల్లం పానకంగా కలిపి పోస్తారు. కాని ఆ కొండమీద ఎక్కడ వెదకినా ఒక చిన్న చీమకూడ కనిపించదు. మధ్యాహ్నం 12 గం. వరకే ఆరాధన. తరువాత తాళములు వేసి అర్చక స్వాములు కొండ దిగి మరుసటిదినంవరకు మరల యెవరూ కొండపైకి యెక్కరు. ఎక్కుట ప్రమాదకరమని కూడా చెప్పుదురు. శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి ఆలయము ముందు గొప్ప గాలిగోపురమున్నది. అంత పెద్ద గోపురం దక్షిణ భారతములో ఒక్కచోటనే ఉన్నదట. సంవత్సరం పొడవునా ఉత్సవాలు జరుగుతూనే ఉంటాయి. దేవునికి యీ నామములవల్ల మంచి ఆదాయమే వస్తుంది. ముక్కోటిఏకాదశికి ఉత్తరద్వార దర్శనము లభిస్తుంది. ఈ స్వామివారిని సేవించిన మానసిక వ్యాధులు కూడా నిర్మూలించును. సర్వ రోగములను బాపగల శక్తిమంతుడు పానకాల స్వామి.

ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. దూర దూర ప్రాంతాలనుండి వేలాది భక్తులు వచ్చి స్వామివారిని సేవిస్తారు. తిరునాళ్ళకు బెజవాడ, గుంటూరు పట్టణాల నుండి ఫ్యాన్సీ వస్తువులు, గాజుల దుకాణాలు, మిఠాయి దుకాణాలు వందలాదిగా వస్తాయి.

స్వామివారి బ్రహ్మోత్సవములకు తోట్లవల్లూరు జమీందారుగారైన శ్రీ బొమ్మదేవర నాగన్ననాయుడుగారు ప్రతిసంవత్సరమూ తప్పకుండా వచ్చి ఉత్సవాలను తిలకించి స్వామివారిని సేవించి వెళ్ళుతూ ఉండేవారు. ఆవచ్చిన సందర్భములో నౌలూరు గ్రామములో విడిదిచేసేవారు. వారు చతురంగబలసమేతులై మంగళగిరికి తరలివచ్చేవారట. ఆ సందర్భములో మా తాతగారైన సుబ్బరాజుగారు అనేకవిధాల రాజాగారికి తోడ్పడినారట. ఏనుగులు, గుర్రాలకు తిండి మేత సదుపాయాలు యేర్పాటుచేసి వాటిని కట్టివేయుటకు పావిళ్ళు యేర్పాటు చేయుచుండెడివారట. ఆ సహాయానికి నాగన్ననాయుడుగారు మెచ్చి మా తాతగారికి నౌలూరులో ఒక పెంకుటిల్లు కట్టించియిచ్చారు.

శ్రీ నాగన్ననాయుడుగారు మంగళగిరిలో మకాంచేసి ఉండగా ఒక అడవిపందివచ్చి ప్రజలను హింసించసాగింది. దానిని వేటాడవలెనని నాగన్ననాయుడుగారు యత్నించగా వారికి అందకుండా తోతాద్రిచుట్టూ తిరుగుతూ ఉండేది. నాయుడుగారు ఆయాసపడి చివరకు నరసింహస్వామివారిని తలుచుకొని నమస్కరించి గుర్రమునెక్కి దానివెంటబడి మూడుసార్లు కొండచుట్టూ తిరుగుతూ చివరకు దానిని సంహరించగలిగారట. అతిప్రయాసతో దానిని సంహరించారని పెద్దలు చెప్పేవారు.

నా చిన్నతనములో మంగళగిరిలో చదువు ప్రైమరీ వరకే ఉండెడిది. దాదాపు నలభైసంవత్సరముల క్రితం చింత క్రింది కనకయ్యగారను సాతాని వర్తకశిఖామణి తనపేర ఒక

హైస్కూలు స్థాపించారు. అది ఇప్పుడు మంచివృద్ధిలో నున్నది.

మంగళగిరి బాగా పెరిగి పెద్దబస్తీయైనది. ఇటీవల మునిసిపాలిటీగా మారినది. నేను 2,3 తరగతులు చదువుతున్న సమయంలో చేబ్రోలునద్దనున్న కోవెలమూడి వాస్తవ్యులు శ్రీ చెన్నాప్రగడ బలరామదాసుగారు అనే మహానీయుడు మంగళాద్రికి వచ్చి కైవారం బాలాంబగారి ఇంట్లో మకాంపెట్టి దేశంమీద తిరిగి చందాలు వసూలుచేసి క్రిందినుండి పానకాలస్వామి గుడివరకూ చక్కనిమెట్లు కట్టించారు. అంతకుముందు సరియైనమెట్లులేక పైకివెళ్ళటం యెంతో కష్టంగా ఉండేది.

కైవారం బాలాంబగారు గొప్పభక్తురాలు. నిరతాన్నదాత. వచ్చిన అతిథులను స్వయంగా కనుగొని భోజనం పెట్టేది. ఎంతోఆదరించి బలవంతంచేసి తినిపించేది. 'అన్నము-కాస్త తిను నాయనా' అంటూ బ్రతిమలాడి పెట్టి తినిపించేది. ఎప్పుడు ఎవరు వెళ్ళినా లేదనకుండా భోజనం పెట్టేది. కులవిచక్షణ లేకుండా పెట్టేది.

50సంవత్సరాల క్రితం నూతక్కి కాపురస్తులు మల్లాది సుబ్బదాసుగారు రెండువందల సంవత్సరాలక్రితము కట్టించిన గాలిగోపురాన్ని క్రిందినుంచి పైవరకూ మరమ్మతు చేయించారు

బందరు గాలివానకు (1864) రెండుశిఖరాలు పడిపోగా మిగిలిఉన్న తొమ్మిది శిఖరాలను కూడా క్రిందికి దింపించి, మేలిమిబంగారపు పూతపూయించి, మళ్ళీ ప్రతిష్ఠ

చేయించారు. నేను యెరిగిన తరువాత జరిగిన గోష్ఠ పనులలో మెట్లుకట్టించుట, గోపురం మరమ్మతులు చేయించుట ముఖ్య మైనవని చెప్పాలి.

మా గ్రామము నౌలూరులో యాదవులు, మహమ్మదీయులు, సాలీలు, కమ్మవారు ఉన్నారు. అన్నీ ఒక వంద ఇళ్ళు షుమారుగా ఉంటాయి. మెట్టపొలాలు, ఊరికి తూర్పు వైపున పోతిరాజు చెరువు, దక్షిణాన గంగానమ్మ చెరువు ఉన్నాయి. మంగళగిరి కొండలమీద పడిన వర్షపునీరు యీ చెరువులలోనికి వచ్చి నిండుతాయి. వీటిక్రింద కొద్ది మాగాణీ భూమి ఉంది. కృష్ణానదికి కరకట్ట పోయకముందు సామాన్యముగా మా ఊరికి ప్రతి సంవత్సరమూ వరదలు వస్తూవుండేవి. యాదవస్త్రీలు మంగళగిరి, బెజవాడలకు తీసుకువెళ్ళి పెరుగు, పాలు, నెయ్యి, వెన్న అమ్ముకుంటూ ఉంటారు. సాయంకాలం పచ్చిగడ్డికోసి అమ్ముకుంటారు. మొత్తము మీద చాలా బీదగ్రామం. మా గ్రామంలో శ్రీ నాగేశ్వరస్వామివారి దేవాలయమున్నది. దానికి మేమే ధర్మకర్తలము. సంగావు పానకాలయ్యగారు అర్చకత్వము చేయుచుండెడివారు. ఆయన ఋషితుల్యుడు. చిన్నతనములో దక్షిణాదికి వెళ్లి ఆగమము, సంగీతము నేర్చుకొని వచ్చాడు. మా రెండు కుటుంబములు ఒకతల్లి బిడ్డలవలె మెలిగేవారు.

నా తండ్రిగారైన శ్రీ నల్లపాటి నరసింహముగారు పోలీసు హెడ్‌కానిస్టేబులుగా కృష్ణాజిల్లా తిరువూరులో సర్వీసు చేయుచున్న కాలంలో 1883 వ సంవత్సరంలో నేను

జన్మించినానని మా నాయనమ్మ గారు చెప్పేడిది. నాకు ఒక అక్కగారు, మరొక చెల్లెలు కూడా ఉండేవాళ్లు. తరువాత మానాయనమ్మగారు నాలూరు చేరుకున్నారు. నాకు మూడు సంవత్సరాల వయస్సులో తల్లి కరువైపోయింది, నాకు నా తల్లి ఎట్లుండెడదో కూడా తెలియదు. నా తల్లి రాజమ్మగారు చనిపోయిన తరువాత నా తండ్రిగారు మళ్ళీ వివాహం చేసుకోలేదు. తన తల్లి చేతిలో పెట్టి, మమ్ము ముగ్గురు పిల్లలను పెంపకం ఏర్పాటు చేయించారట. మానాయనమ్మ నూరు సంవత్సరాలు జీవించింది. మంగళగిరి గాలిగోపురం కట్టటం ఆమెకు బాగా తెలియునట. కట్టుబడి పూర్తి అయిన తరువాత అమరావతీ జమీందారు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారు మంగళగిరికి వచ్చి గాలిగోపురానికి ప్రారంభోత్సవం చేశారట. ఆ ప్రారంభోత్సవ సమయాన వారు మొదటి అంతస్తుపైకి యెక్కి అక్కడ నిలబడి రూపాయలు వెదజల్లారట. అందులో ఒక రూపాయి మా తాతగారి తల పాగాలో పడినదని మా నాయనమ్మగారు చెప్పుతూ ఉండేది.

నేను ఒక్కడినే మగపిల్లవాడిని కాపటం వల్ల మా నాయనగారు నా యందు చాలా వాత్సల్యముతో దయా ప్రేమలను ఒలకపోస్తూ ఉండేవారు. కాని ఏదైనా తప్పుచేస్తే మట్టుకు ఒళ్లు చిట్లగొట్టేవాడు.

నా చదువుకొరకు మానాయన మంగళగిరికి కాపురం మార్చారు. ప్రైమరీ పరీక్షవరకూ మంగళగిరిలోనే చదువుకున్నాను. ఆ కాలంలో ప్రైమరీ పరీక్ష గవర్నమెంటువారు

నిర్వహించేవారు. నా చిన్నతనంలో చిలిపిగా బాగా అల్లరి చేస్తూండేవాడినట.

మంగళగిరిలో మా యింటి దగ్గరలో ఒక అర్చకుడు పెద్ద జబ్బులో ఉన్నాడు. వారి యింటికి ఎదురింటిలో డెప్యూటీ తహశీల్‌దారుగా రుండేవారు. ఆయనకు ప్రతి రోజూ పోస్టు ద్వారా చాలా విజ్ఞప్తులు వస్తూవుండేవి. విజ్ఞప్తి కాగితాలు తీసికొని ఖాళీ కవర్లు బయట ఒక గూటిలో పడవేసేవారు జవాన్లు. మేము అక్కడకు వెళ్లి ఆ ఖాళీ కవర్లు తస్కరించి వానినిండా ఇసుక నింపి ఆ కవర్లను ఆ అర్చకుని ఇంటి తలుపుకు వేసి కొట్టటం మాకొక ఆటగా పరిణమించినది. ఎవరో చూచినవారు యీ సంగతిని మా నాన్నగారికి వెళ్ళి చెప్పారు. వెంటనే ఆయన అక్కడకు వచ్చి నన్ను పట్టుకొని ఒడలు చిట్లునట్లుగా బాదుకొంటూ యింటికి తీసికొనివెళ్ళి అక్కడమళ్ళా చావచితక కొట్టాడు. మా అక్క, చెల్లెలు కాపురాలకు వెళ్ళగా ఇంట్లో మా నాయన నేను మాత్రమే ఉండేవాళ్ళము.

నేను ప్రైమరీ పూర్తిచేసిన తరువాత గుంటూరులోని ఎ. యి. యల్. యం. కాలేజీ అండ్ హైస్కూలులో చేర్పించాడు మా నాయనగారు. ఆ స్కూలులో స్కూలుఫైనలు వరకూ చదివాను. లెక్కలురాని కారణాన చదువుకు స్వస్తి చెప్పాను. 1901 నుండి 1906 వరకూ గుంటూరులో చదువు కున్నాను.

ఆరోజుల్లో ఫస్టుఫారానికి ఫీజు నెలకు రూపాయి పావలా ఉండేది. పూటకూళ్ళమ్మకు నెలకు నాలుగురూపా

యలు యిస్తే ఘుమఘుమలాడే కమ్మనినెయ్యి, వేయించిన కందిపప్పు, తియ్యని గడ్డపెరుగు వేసి ముప్పొద్దులా భోజనం పెట్టేది. మిషన్ కాలేజీలో హరిజనబాలురతో కలసి చదువుకునేవాణ్ణి. అది నాకేమీ కష్టమనిపించేది కాదు. వాళ్ళబోర్డింగులకు వెళ్ళి పరిశీలించి చూచివస్తూ ఉండేవాడిని.

1905 లో గుంటూరు కాలేజీలో చదువుకొనేరోజుల్లో వైస్రాయి కర్జను ప్రభువు బంగాళమును రెండుగా విభజించాడు. దానికి నిరసనగా బెంగాలీలు వందేమాతరం మహోద్యమము ప్రారంభించారు. దేశమంతా వందేమాతరం ధ్వనితో మారుమ్రోగింది. దానితో స్వదేశీ ఉద్యమాన్ని కూడా ప్రారంభించారు. స్వదేశీ వస్తువులనే వాడుకోవలయునని, జాతీయపాఠశాలలు నెలకొల్పి, పిల్లలకు జాతీయవిద్యనే చెప్పించవలెననీ, గవర్నమెంటు నౌకరీలు చేయరాదనీ, చేతిపనులను ప్రోత్సహించవలెననీ ఆ ఉద్యమంలో ముఖ్యోద్దేశ్యాలు. వందేమాతరం నినాదం దేశం నాల్గుచెరగులా మారుమ్రోగుతోంది. మరియొక చెంపన బ్రహ్మసమాజోద్యమ ప్రభావం వెల్లివిరిసినది. వీరేశలింగంగారి వితంతు వివాహాల ప్రభావంవలన ప్రజలలో సంస్కారం కూర్చిన అలజడులు ప్రబలముగా ప్రచారము నందుచున్నవి. నాబోటి యువకులకు ఆరోజులలో వితంతు వివాహములు మొదలగు నూతనోద్యమములకు నాయకత్వము వహించిన శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు ఆదర్శపురుషులుగా ఉండేవారు. వీటికితోడు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, వివిధ గ్రంథమాలలు ప్రకటించిన గ్రంథములు చదివి ప్రభావితుడ

నైనాను. 'అబ్రహాం లింకన్', ఆనందమఠము మొదలగు నవలలు చదివి మన దేశ స్వాతంత్ర్యమునకు నడుముకట్టాలని ఉద్రూతలూగేవాళ్ళము.

మా స్వగ్రామమైన నౌలూరు గ్రామమునకు మా పెదతండ్రిగారి హయామువరకు ఆగ్రామ కరణీకము మా చేతులలోనే ఉండేది. నాతండ్రి నరసింహముగారు. తల్లి రాజమ్మగారు. మా అమ్మ పుట్టినిల్లు తెనాలివద్దనున్న కొలకలూరు. ఆమె 'భర్తేప్రూడి' వారి ఆడబడుచు. మామాతామహ వంశీకులకు అబద్ధమాడటం తెలియదు. బహుకచ్చితమైన మనుష్యులు. ఈ రెండుగుణములు మా అమ్మవల్ల నాకు సంక్రమించినవని చెప్పాలి.

నౌలూరులో నేనూ మా నాయన ఉండేవాళ్ళమని పైన చెప్పాను. మానాయన వంటచేసెడివాడు. ఇంటి పైపనులన్నీ నేను చేసెడివాడను. ఇంట్లో నాయీడు వాళ్ళెవరూ లేనికారణాన స్నేహితులున్నచోట్లకు వెళ్ళి చూచివస్తూ ఉండేవాడిని, అక్కచెల్లెళ్ళ గ్రామాలకూ వెళ్ళివస్తూ ఉండేవాడిని. ఒక్కొక్కప్పుడు చాలారోజులకుగాని తిరిగి ఇంటికి వచ్చెడివాడనుకాను. ఇరుగుపొరుగువారు నరసింహముగారు చనిపోతే అప్పుడు హనుమంతరావు ఏదేశంలో ఉంటాడోనని పరిహాసం చేస్తూఉండేవాళ్ళు. తాను మంచములో పడివుంటే తనకు ఉపచారము చేయననే నమ్మకమువల్ల కాబోలు భారతములోని ధర్మవ్యాధుడనే కటికవాని కథను నాకు మాటిమాటికి చెప్పి చదివించుచుతూ ఉండేవాడు మానాయన.

నాలో వందేమాతరం ఉద్యమ ప్రభావంవల్ల జాతీయ భావము లంకురించాయి. స్వదేశీగుడ్డలు కట్టుటకు ప్రారంభించాను. ఆకాలంలో స్వదేశీ గుడ్డలంటే మిల్లునూలుతో నేసిన చేనేతవస్త్రాలు. బ్రహ్మసమాజం ప్రభావంవల్ల నాలో సంస్కారభావాలు పొటమరించాయి. అక్కడక్కడా వితంతు వివాహాలు జరుగుతూ ఉండేవి. వాటినిగురించి ప్రజలు విస్తారముగా చెప్పుకునేవారు. వారిబోధలవల్ల విగ్రహారాధన అంటే నాకు అయిష్టం యేర్పడ్డది, ఇప్పటికికూడా దేవాలయమునకు పోవటం నాకు అవసరమనిపించదు. ఒకవేళ వెళ్ళినా ఏదో లాంఛనప్రాయంగా విగ్రహానికి నమస్కరించటంతప్ప భక్తిభావం కలుగుటలేదు. చిన్నతనమునుండీ నీతినియమములప్రకారం నడచుకోవటం, అబద్ధమాడకుండా జీవితనౌకను నడపుకోవడానికి అలవాటుపడ్డాను. అలాగే నడచుకొంటూవచ్చాను.

నేను చదువుకునే రోజులలో శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు, వారిద్వారా నంబూరి శేషాచార్యుగార్లతో పరిచయమేర్పడినది. వారిద్దరూ అప్పుడు ఎఫ్. ఏ. చదువుతూ ఉండేవాళ్ళు. ఉమాకాంతంగారి గది తెలుగు గ్రంథాలతో నిండిఉండేది. వారు తెలుగుకావ్యములన్నీ చదివి స్వయంకృషివల్లనే గొప్ప పండితులైనారు. శతావధానాలు చేస్తూండేవారు. శేషాచార్యులుగారు ఇంగ్లీషులో రైనాల్డు నవలలు ఊపిరిసలుపకుండా చదువుతూండేవారు. వారిద్దరినీ అనుకరిస్తూ ఆ రెండుభాషలలోని గ్రంథములను నేనూ చదువుతూ ఉండేవాణ్ణి. వందేమాతరం ఉద్యమ ఫలి

తంగా, ఆంధ్ర దేశములో అనేక గ్రంథమాలలు వెలిసినాయి వారు సుప్రసిద్ధ పురుషుల జీవితచరిత్రలు, ప్రఖ్యాత రచయిత శ్రీ బంకించంద్ర ఛటర్జీ రచించిన నవలలు ప్రచురిస్తూ ఉండే వారు. కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారి విజ్ఞాన చంద్రికామండలి వారి గ్రంథములు, ఇవన్నీ ఉమాకాంతం గారి గదిలో నిండిఉండేవి. అవన్నీ చదువుతూ ఎక్కువకాలం అక్కడే గడుపుతూ ఉండేవాడిని. శ్రీ చిలకమర్తి లక్ష్మి నరసింహముగారి నవలలు, నాటకాలు, వీరేశలింగంగారి గ్రంథాలు, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక శ్రద్ధగా చదువుతూ ఉంటే మనస్సుకు ఆనందము కలుగుతూ ఉండేది. ఆకాలంలో ప్రతి సంవత్సరమూ మండల సభలు, సంఘ సంస్కరణ సభలు జరుగుతూ ఉండేవి. వాటికి తప్పకుండా హాజరయ్యేవాడిని. ఉన్నవ లక్ష్మినారాయణగారితోను, దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారితోను కాలంగడిపేవాడిని. తరువాత గ్రంథాలయోద్యమ ప్రభావంకూడా నామీద పడకపోలేదు. మంగళగిరి దేవస్థానమువారి గదులలో ఒకగది తీసుకొని శ్రీ లక్ష్మి నరసింహగ్రంథాలయమును స్థాపించినాను. 3-4 వందల గ్రంథములను సేకరించి లైబ్రరీకి చేర్చాను. పత్రికలూ వచ్చేవి. నేను ఆ వూరు వదిలినతరువాత అది అసమర్థుల చేతులలో పడి, క్రమంగా అంతరించిపోయింది.

శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారు గుంటూరులో ప్లీడరుగా ప్రాక్టీసుచేయుచు ప్లీడరువృత్తిమీద ఆరోజులలో తరుచు మంగళగిరి సబ్ మ్యాజిస్ట్రేటు కోర్టుకు వస్తూ ఉండేవారు. వారిని మా ఇంటికి పిలుచుకొనిపోయి ఉప

హారములు, కాఫీ ఇస్తూ స్నేహంగా ఉంటూ ఉండేవాళ్ళము. నాకు ఆకాలంలో ఒకనవల వ్రాయవలెనని కుతూహలంకలిగి నవల వ్రాయ నారంభించాను. ఏదో కొంతవరకు వ్రాశాను. శ్రీ లక్ష్మీనారాయణగారు మాయింటికి వచ్చినప్పుడు దానిని చదివి వినిపించాను. వారు విని సంతోషించారు.

ఆ కాలంలో గుంటూరులో "దేశాభిమాని" అనే వారపత్రికను దేవాగుప్తుని శేషాచలపతిరావుగారనేవారు ప్రారంభించారు. ఆయనొక మధ్వ పంతులు. ధైర్య సాహసాలు కలిగి ఎంతో ప్రపంచజ్ఞానం కలవాడాయన. ఖచ్చితమైన మనిషి. మంచి వక్త. దేశాభిమాని అనేవారపత్రికకు యజమానులు, సంపాదకులు, ప్రచురణకర్త కూడాను. గుంటూరులోని పెద్దలు, యువకులు, వారిని ఎంతో గౌరవించేవారు. భయభక్తులతో చూచేవారు. ఆచార వ్యవహారాలలో పూర్వాచార పరాయణులైనా వితంతు వివాహం చేసుకున్న ధీశాలి. పత్రికలోని వారి వ్యాఖ్యలు నిర్భయముగా నిర్మొహమాటముగా ఉండేవి. వారియెదుటపడి మాట్లాడుటకు పెద్దలందరూ భయపడేవారు. కాని వారు చాలా సౌమ్యస్వభావము కలవారు. పత్రికలలో దేశాభిమానపూరిత వ్యాసములను వ్రాసి ప్రకటించేవారు. శేషాచలపతిరావుగారిని అందరూ పేరున పిలవక, దేశాభిమానిగారు అనే పిలిచేవారు. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు నన్ను తీసుకొనివెళ్ళి దేశాభిమానిగారికి పరిచయ పరచి, నాకు ఆ పత్రికలో ఉపసంపాదకుని ఉద్యోగం ఇప్పించారు. ఆ ఉద్యోగంలో ప్రవేశించాను. మొదటి నెల పూర్తి అయిన

వెంటనే యజమాని నా జీతమును – రు 15- వెండి రూపాయలు బొత్తి నా చేతికిచ్చినప్పుడు నాకు కలిగిన ఆనందము నకు మేరలేదు. ఆ డబ్బు తీసుకొని వెళ్ళి మానాయనకిస్తే ఆయన అపరిమితానందభరితుడై నన్నాశీర్వదించాడు. నేను ఆ పత్రికలో ఒక సంవత్సరకాలం పనిచేశాను. రాజకీయ చైతన్యం వెల్లివిరిసిన వందేమాతరం రోజులు. ప్రథమ ప్రపంచ సంగ్రామం జరుగుతున్న రోజులుకూడాను. మా యజమాని అప్పుడు ఉత్సాహం కొద్దీ డబ్బులు లేకపోయినా వారపత్రికను దినపత్రికగా మార్చి, కొద్దికాలం నడిపి నష్టపడి పత్రికా ప్రకటనమును మానివేశాడు. జీతాలు సరిగా ముట్టక నేనూ మానుకున్నాను. దేశాభిమాని పత్రికలో నేను పనిచేయుచున్నప్పుడు శ్రీ ముగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఇంకా చదువుకు ఎడింబరోకు వెళ్ళలేదు. కొత్తపేటలో అవ్వారి రామయ్యగారి మేడలో ఆయన, ఆయన నాయనమ్మ రాజమ్మగారు కాపురముండేవారు. ఆ మేడమీద గదిలో శ్రీ జొన్నవిత్తుల గురునాథంగారనే రాజకీయవేత్త ఉండేవారు. అక్కడికే శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శీరం వేంకట సుబ్బారావు, నడింపల్లి వేంకట లక్ష్మీనరసింహారావు, మద్ది రాధాకృష్ణయ్య వగైరా యువకులంతా చేరుతూ ఉండేవారు. నేనూ ఆ సమీపంలోనే ఒకగదిలో ఉంటూ ఉన్నందువల్ల తరుచుగా నేనుకూడ ఆ సమావేశములకు హాజరగుతూ ఉండేవాడను. ఆంధ్రరాష్ట్రం యెందుకు కావలెనో 'హిందూ' ఇంగ్లీషు దినపత్రికలో వ్యాసపరంపర వ్రాసి నిరూపించిన వారు మహామనీషి జొన్నవిత్తుల గురునాథం, న్యాపతి నారాయణ రావుగార్లు.

మనుచరిత్రలోని ప్రవరాఖ్యుని శీలము, డైనాల్డ్సు నవలలో వర్ణింపబడిన లండన్ నగరమునందలి బీదల దుర్భర దారిద్ర్యము నా మనస్సును ద్రవింపజేసినవి. దీనికితోడు శ్రీ వివేకానంద స్వామివారు వర్ణించిన మలబారులోని హరిజనుల అగచాట్లు నా మనస్సును కలవరపరచినవి. విక్టర్ హ్యూగో వ్రాసిన 'బీదలపాట్లు' (లే మిజరబుల్సు) అనే గ్రంథము, టాల్ స్టాయి వ్రాసిన కథలు, నవలలు, తదితర గ్రంథాలు నన్ను బాగా సంస్కరించాయి. 'బానిసతనమునుండి పైకి' (Up from slavery) అనే గ్రంథాన్ని చదివినపిమ్మట అమెరికా పోవాలనే కుతూహలం కలిగింది. ఈ గ్రంథము లన్నిటితో పాటు 'What then must we do' అనే గ్రంథమును చదివి నప్పుడు సేవాధర్మమునకు జీవితమును అంకితము చేయవలె ననే సంకల్పం కలిగింది. 'బానిసతనమునుండి పైకి' అనే గ్రంథము బానిసగా ఉన్న ఒక నీగ్రోజాతీయుడు తన జాతిని ఉద్ధరించిన కథ. తాను కష్టపడి చదువుకొని విద్యావంతుడైన తరువాత 1200 ఎకరముల భూమిని కొని, 'టస్కీజీ ఇన్‌స్టిట్యూట్' అను విద్యాసంస్థను స్థాపించి, ఆ సంస్థలో ఆయన అనేక వృత్తివిద్యలు యేర్పాటుచేసి, నీగ్రో జాతిని ఉద్ధరించిన కథ. శ్రీ మంగిపూడి వేంకటశర్మగారి "నిరుద్ధభారతము" చదివిన తరువాత హరిజనోద్ధరణ నిమిత్తం పైన పేర్కొనినటు వంటి సంస్థ నొకదానిని స్థాపించవలెనను సంకల్పము నాకు కలిగినది.

నండూరి శేషాచార్లుగారు పరమమిత్రులైనారు. నన్ను ఆయన తన సహోదరునివలె చూచుకొనేవారు. అతిప్రేమతో

ఆదరించేవారు. అందువల్ల ఆయనతో కాలక్షేపం చేయవలె నని 1913 లో మద్రాసుకు వెళ్ళాను. ఆయన అప్పుడు మద్రాసు మెడికల్ కాలేజీలో వైద్య శాస్త్రమును (L.M.P) చదువుచున్నాడు. అక్కడ కొన్నాళ్ళున్నాను. ఆకాలంలో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఆంధ్ర పత్రికను గులాబీరంగు రఫ్ కాగితముమీద పెద్దసైజులో వార పత్రికగా బొంబాయినుండి ప్రకటిస్తూ ఉండేవారు. ఆ ఆంధ్ర పత్రికను మద్రాసుకు తీసికొనివచ్చి దినపత్రికగా ప్రకటించ బోతున్నారన్న వార్త విన్నాను. పంతులుగారు మద్రాసుకు వచ్చినప్పుడు శ్రీమాన్ పండిత గోపాలాచార్లుగారి ఆయు ర్వేదకళాశాల భవనంలో మకాం చేస్తారు. ఆకాలంలో జార్జిటౌన్ మద్రాసు నివాసులు పండిత గోపాలాచార్లుగారిని అపర భగవంతుడుగా, సాక్షాత్తు అపరధన్వంతరి అవతారంగా కొనియాడుతూ ఉండేవాళ్ళు ఒకరోజున ఆయుర్వేద కళా శాలకు వెళ్ళి పంతులుగారిని కలుసుకొన్నాను. ఆంధ్రపత్రి కలో సంపాదకీయశాఖలో ఒక సబ్ఎడిటర్ పోస్టు ఇప్పించ మని కోరినాను. లోగడ 'దేశాభిమాని' పత్రికలో పనిచేసి అనుభవం గడించినాననికూడా చెప్పాను. కొద్దిరోజుల తరు వాత కార్యాలయం మద్రాసులో ప్రారంభిస్తాము. అప్పుడు వచ్చి చూడమన్నారు. తిరిగి ఇంటికి వచ్చేశాను.

తరువాత ఒకసంవత్సరము గడచింది. 1914 లో ఆంధ్ర పత్రికను దినపత్రికగా మార్చి కార్యాలయాన్ని మదరాసుకు మార్చినట్లు పత్రికలో చూచి, మద్రాసుకు బయలుదేరి వెళ్ళాను. మద్రాసులో పంతులుగారిని దర్శించాను. నాచేత

ఇంగ్లీషునుండి తెలుగులోకి తర్జుమా చేయించి చూచారు. నాతర్జుమా తృప్తినిచ్చిందికాబోలు, అప్పటికప్పుడు నెలకు రు 30 లు వేతనమువిూద ఉద్యోగమునకు ఆర్డరు యిచ్చారు. కొంతకాలం పత్రికలో శ్రద్ధగా పనిచేశాను. మొదట కొన్ని రోజులు పత్రికా కార్యాలయము ఒక అద్దెఇంట్లో ఉంటూ ఉండేది. స్వంతబిల్డింగు కొనటానికి పంతులుగారివద్ద పూర్తి పైకం లేదనుకుంటాను. శ్రీమాన్ పండిత గోపాలాచార్లుగారి పలుకుబడిని వినియోగించుకొని తంబుచెట్టి వీథిలోఉన్న బిల్డింగుకు అప్పుడు కొంతడబ్బుయిచ్చి మిగతాది వాయిదాల మీద తీర్చుకొనుపద్ధతిలో కొన్నారు. ఆరోజులలో గోపాలా చార్లుగారి పలుకుబడి అఖండము, అప్రతిహతము. అదృష్ట వశాత్తు సరిగ్గా దినపత్రికగా ప్రారంభించిన సమయములోనే ప్రథమప్రపంచ మహాసంగ్రామం ప్రారంభమైనది. పత్రికకు అంతులేని ప్రచారం కలిగినది. నేను పత్రికాఫీసులో ప్రవేశించి పనిచేయుచున్నప్పుడు శ్రీకోటంరాజు పున్నయ్య, శ్రీ ఆవట పల్లి నారాయణరావుగార్లు సబ్ ఎడిటర్లుగా ఉండేవాళ్ళు. ఆరోజులలో ఇప్పుడున్నంతమంది సబ్ ఎడిటర్లు ఉండేవాళ్ళు కాదు. పనికొంచెం కష్టంగానే ఉండేది. మొదటిప్రపంచమహా యుద్ధం ప్రారంభమైన కారణాన పత్రికాకార్యాలయంలో పని హెచ్చైపోయినందువల్ల నాకు చాలా జబ్బుచేసినది. వార్తలు తర్జుమా చేయటం నాపని. నెలకు నాకు ముప్పది రూపాయలు ఇచ్చేవారు. ట్రిప్లికేనులో నానివాసము. పది రూపాయలు హోటలుకు యిచ్చేవాడిని. తక్కినది రాక పోకలకు చాకలికి మంగలికి సరిపోయేది. నారాయణరావు,

ప్రసన్నయ్యగార్లు మాతో సాయిలాపాయిలాగానే ఉండేవారు. అవి ఒకగమ్మత్తు రోజులుగా గడచిపోయినవి. నాకు మద్రాసులో కాలం బాగానే గడచిపోయినది. పని యెక్కువగుటవల్ల జబ్బుచేసి ఉద్యోగానికి సెలవుపెట్టి మానాయనవద్దకు మంగళగిరికి వచ్చివేశాను. ఆరోగ్యం పొందుటకు మందులు వాడటం అప్పటికే నాకు యిష్టముండేదికాదు. ఆహారము మార్చి తగిన వ్యాయామముచేస్తే యెటువంటి రోగమైనా నయముచేయవచ్చునని నాకు నమ్మకం కలిగినది. మదరాసులో ఉండగానే అమెరికా దేశములో సుప్రసిద్ధ ప్రకృతిచికిత్సా నిపుణుడైన బెర్నార్ మేక్ ఫేడన్ వ్రాసిన 'ది సుపర్బ్ వైటాలిటీ' అనే గ్రంథం తెప్పించాను. దానిలో ఆహారనియమాలు,నడక వగైరా వ్యాయామములనుగురించి ఆయన విపులీకరించి వ్రాశారు. అప్పటి నాస్థితి నాలుగడుగులు వేయడం కష్టంగా ఉండేది. ఉదయముననే కాలకృత్యములు తీర్చుకొని పానకాల స్వామి మెట్లు యెక్కడం ప్రారంభించేవాణ్ణి. ఎక్కగలిగినంత దూరం యెక్కి అక్కడ చతికిలబడి నిర్మలమైన కొండగాలి పీల్చేవాడిని. క్రమక్రమముగా 11–12 వందలమెట్లు యెక్కి స్వామిగుడిదగ్గరకు పోగలిగాను. ఇంటికివచ్చి చల్లనినీళ్ళు పోసి ఉంచిన తొట్టిలో ఒక్కనిమిషము కూర్చుని, చల్లనినీటితో స్నానముచేసెడివాడిని. కొలిమిలో యెర్రగాకాలిన ఇనుపముక్కను చన్నీటిలో ముంచితే దానికి గట్టితనం యెలా వస్తుందో, అలాగే వ్యాయామము చేసినప్పుడు వేడియెక్కిన శరీరము చన్నీటిలో కూర్చుంటే అట్లా గట్టిపడుతుంది. ఆహారముగా గోధుమరొట్టె, కూరలు, పండ్లు,ఆవుపాలు ఉపయో

సించేవాడిని. సాయంకాలం తాడేపల్లి కొండమీద షుమారు రెండుమైళ్ళు అతివడిగా నడిచి ఇంటికివచ్చి ప్రొద్దుటివలెనే తొట్టిలోకూర్చుని వెంటనే చన్నీటితో స్నానం చేసెడివాడిని. ఇలా ఒకనెలరోజులు చేయునప్పటికి మంచి ఆరోగ్యం కలిగింది. తరువాత మెట్లుయెక్కడం మాని అతివడిగా కొండనెత్తానికి యెక్కడం ప్రారంభించాను.

ఈ విధంగా కొద్దిరోజులలో పూర్ణారోగ్యమును పొందగలిగాను. ఆ కాలములో నేను కలకత్తానుండి శ్రీ రామానందఛటర్జీగారు ప్రకటించుచుండిన "మాడరన్‌రివ్యూ" అనేమాసపత్రికను తప్పకుండా తెప్పించి చదివేవాడిని. దానిలో మనదేశమునుండి అమెరికాకు వెళ్ళి కష్టపడి పనిచేసుకుంటూ పెద్దపెద్ద చదువులు చదివిన యువకుల చరిత్రలు, వారి ఫొటోలతో సహా ప్రచురించేవారు. మన తెలుగుదేశము నుండి కూడా కొందరు యువకులు అలా వెళ్ళి చదువుకొని వచ్చారు. అందులో మాగంటి బాపినీడుగారొకరు. అటువంటి కథలు చదువుతున్న కొద్దీ అమెరికావెళ్లి, వ్యవసాయ శాస్త్రమునందు పట్టము సంపాదించి, స్వదేశమునకు తిరిగి వచ్చి, ప్రభుత్వము వారినడిగి 5-6 వందలు యెకరాల భూమిని సంపాదించి, 'టస్కేజీ సంస్థవంటి సంస్థను' స్థాపించి, హరిజన సేవచేయవలెనను కుతూహలము నానాటికి నాలో పెరుగజొచ్చినది. అమెరికా పోవలెనంటే కనీసము 2000 రూపాయలు కావలసి యుండును. అంతపైకమును పుట్టించగల తాహతు నాకు, నా కుటుంబమునకు లేదు. ఎవరైనా నా స్నేహితులు సాయపడుదురేమోనని ప్రయత్నములు చేయుచుండెడివాడను.

అప్పుడు తెనాలి తాలూకా పెదపాలెము గ్రామము నుండి గుంటూరు వెళ్ళుతూ, మార్గమధ్యంలో మంగళగిరిలో మకాము చేస్తూ, నేనున్న చోటికి వచ్చి నాతో పరిచయము కల్పించుకొన్నారు ఇద్దరు ధనిక స్వాములు. అమెరికా వ్యవహారము వారితో ప్రస్తావించాను. వారు తప్పక సహాయము చేస్తామని వాగ్దానాలు చేశారు. వారికొరకు ప్రతివారము, పది రోజులకు ఒక మాటు పెదపాలెము వెళ్ళి వస్తూ ఉండేవాడిని. 1916వ సంవత్సరముంతా పెదపాలెం చుట్టూ తిసుగుటతో సరి పోయింది.

ఈ సమయములో పెదపాలెములో శ్రీ పుతుంబాక సీతారామయ్యగారి పరిచయ భాగ్యము లభించింది. వారు నన్ను పెదపాలెం రాకకు కారణమడుగుతూ ప్రశ్నించారు. కారణం వివరించి చెప్పాను. సీతారామయ్యగారు అదివిని నవ్వి "మీకు సహాయం చేస్తామన్న పెద్దమనుషులు చెప్పిన మాటలు వట్టి బూటకాలు, పర్వాబద్ధాలు. వారి మాటలు నమ్మి వృథాగా శ్రమపడి తిరుగుతున్నారా? వృథాగా శ్రమ పడవద్దు" అని సలహా యిచ్చారు. తరువాత మీ మనసులో నున్న సంస్థను స్థాపించుటకు భూమి యెంత కావలసి ఉంటుంది? హీనపక్షంగా ధన మెంత కావలెను? మొత్తం లెక్క వేసి చెప్పమన్నారు. డసీసం ఒక్క ఎకరం భూమి కావలెనని అన్నాను.

శ్రీ సీతారామయ్యగారు సద్గుణ సంపన్నులు. గొప్ప పండితులు, కవులు. వారు చదువని తెలుగు ప్రబంధముగాని, ఇతర ఆంధ్ర గ్రంథములుగాని లేవు. వైష్ణవ మతరహస్యములు

గ్రహించుటకు తమిళమునుకూడా చదివి పాండిత్యమును గడించారు. "తిరుప్పావై" అను తమిళ భక్తిగ్రంథమును ఆంధ్రములో పద్య కావ్యముగా రచించారు. ఒక విశిష్టాద్వైతమే కాదు, ద్వైతాద్వైత సిద్ధాంతము లన్నిటిని ఆకళించుకొన్నారు. ఏమి చదివినా క్షుణ్ణముగా చదివి జీర్ణము చేసుకునేవారు. పాండిత్యమునకు వన్నె పెట్టే దేశాభిమానము వారిలో ప్రస్ఫుటముగా కనపడేది. మన దేశములో గ్రంథాలయోద్యమము ప్రారంభము కాకపూర్వమే తన స్నేహితులతో కలసి పెదపాలెములో "ఆర్యబాల సమాజ" మను ఒక పౌరగ్రంథాలయమును స్థాపించారు. ఇప్పుడా గ్రంథాలయము కొన్ని వేల పుస్తకములతో సుందరమైన విశాల భవనముతో నలరారుచున్నది.

శ్రీ సీతారామయ్యగారి రూపము ఎంతటి సుందరమైనదో, వారి బుద్ధికూడా అంతటి తేజోవంతమైనది. అపర రామానుజులవలె స్ఫురించేవారు. మేలిమి బంగారు ఛాయ గల పొడవైన సన్నని శరీరము. 5'7" ఎత్తు కోటేరువంటి నాసిక. సుందరమైన తామరరేకులవంటి కన్నులుగల. కోల ముఖము. ముఖమంతయు నున్నగా క్షౌరముచేయించుకొని ఊర్ధ్వపుండ్రములు ధరించి, తెల్లని సన్నని ఖద్దరు ధౌతమును బిళ్లగోచీ పెట్టి ధరించి, పైన తెల్లని ఉత్తరీయమును కప్పుకొని ఆకుచెప్పులతో బజారు వెంట వెళ్లుతూ ఉంటే ఎవరా యీ వైష్ణవస్వామి? అపర రామానుజులవలె విలసిల్లుతున్నారని వారి సుందర రూపమును చూచి భ్రమించేవారు. గర్వము అతిశయము తెలియని శాంత స్వభావము, వారి వీర వైష్ణవ

మును వేనోళ్ల చాటుతూ ఉండెడిది. ఉదారమగు శ్రీ రామానుజులవారి సిద్ధాంతములను జీర్ణముచేసికొన్న శ్రీ సీతారామయ్యగారికి నేను చెప్పిన హరిజనోద్ధరణ కార్యక్రమము బాగా వచ్చినది.

శ్రీ సీతారామయ్యగారికి నరసయ్యగారనే అన్నగారు, శ్రీ కృష్ణయ్యగారనే తమ్ముడూ ఉండేవారు. వారితండ్రి పిచ్చయ్యగారు పరమపదము నొందినకారణాన చిన్నతనము లోనే సంసారభారము నరసయ్యగారి భుజస్కంధములపై బడ్డది. అందువల్ల వారు పెద్దగా చదువుకొనుటకు అవకాశము లేకపోయింది. సంపన్నకుటుంబమైనందున దానిని తీర్చిదిద్దుటలో వారికి మంచి ప్రపంచజ్ఞానము, వ్యవహార దక్షత అలవడినవి. అన్నగారి ఆదరణలో శ్రీ సీతారామయ్యగారికి సంస్కృతాంధ్ర భాషాధ్యయనము చేయుట కవకాశము పూర్తిగా కలిగినది.

శ్రీకృష్ణయ్యగారు నూటికినూరుపాళ్ళు చిన్నన్నగారి అడుగుజాడల్లో నడుచుకొనేవారు. వారిద్దరిదీ దైవసంపద. అన్నదమ్ములు ముగ్గురూ చక్రాంకితులై గురుమంత్రోపదేశమునుపొంది వేషభాషలలోను, ఆహారవిహారములలోను, ఆచార వ్యవహారములలోను తు చ తప్పకుండా వైష్ణవమతానుసారమూ జీవనము గడపుచుండెడివారు. వారి గృహములు నిత్యమూ గోమయముతో అలికి ముగ్గులుపెట్టబడి యెంతో శుచిశుభ్రతలతో నలరారుచుండెడివి. వారినిచూచి, వారిబంధువులు, ఆ బంధువుల బంధువులు అనేకకుటుంబములు

మత్స్యమాంసాశనముల మాని శాకాహారులై సద్గుణ సంపద శుచి శుభ్రతలను అలవరచుకొన్నారు.

శ్రీ సీతారామయ్యగారు వారి అన్నదమ్ములతో సంప్రదించి, నేను ప్రారంభించదలచిన హరిజనసేవకు ఒక ఎకరము భూమి కొనియిచ్చుటకు అంగీకారము తెలిపినారు. ఆ గ్రామమునకు పడమర దిక్కున కృష్ణకాలవను ఆనుకొని యున్న పొలమును కొన్నారు. ఆ రోజులలో పెదపాలెం గ్రామము ఐశ్వర్యముతో తులతూగుతూ ఉండేది. స్త్రీలవద్ద పురుషులవద్ద కావలసినంత డబ్బు వెల్లువ్వుడూ మూలుగుతూ ఉండేది. విద్యావంతులూ, సంస్కారులునయిన స్త్రీలు. స్త్రీల నుండి వసూలు చేసియిచ్చిన డబ్బుతో ఒక పాకను నిర్మించి దానిలో హరిజన బాలబాలికలకు 1917వ సంవత్సరములో ఒకచిన్న పాఠశాలను స్థాపించి దానికి 'శ్రీ కృష్ణాశ్రమ'మని నామకరణము చేశాము. ఆ రోజులలో హిందువులుగా ఉండే హరిజన పిల్లలు చదువుకొనవలెనంటే క్రైస్తవ మతమును స్వీకరించి, మిషనరీ బోర్డింగులలో ప్రవేశించిన గాని మరొక మార్గమంటూ ఉండేదికాదు. అందువల్ల భోజనవసతి యేర్పాటు చేయవలెనను సంకల్పము మాకు కలిగినది. చందాలవల్ల పదివేలరూపాయలు వసూలుచేసి, 1923లో పెద్దభవనమును, కొన్నిపాకలను నిర్మించి 50 మంది బాలురకు భోజనవసతి కల్పించినాము. అప్పుడు మా బోర్డింగులో చేరిన బాలురలో హెచ్చుమంది మాలమాదిగ దాసుళ్ళు. దాసుళ్ళు అంటే వైష్ణవ మతస్థులన్న మాట. మాలమాదిగెలకు వివాహాది కార్యములు చేయించే పురోహితులు. పూర్వ

హిత్యానికి తోడు వైద్యముకూడా వారికి వృత్తిగా ఉండేది. వైద్యవృత్తిలో వారిలో కొందరు చాలా పేరుప్రతిష్ఠలు సంపాదించినవారూ ఉండేవారు. వారికి హిందూమతము, సంస్కృతీ సంప్రదాయములయందే నమ్మకము, పట్టుదల హెచ్చు. చదువులలోనుండే లాభము వారికి బాగుగా తెలియును. అందువల్ల వారిపిల్లలు హెచ్చుమంది వచ్చి మా బోర్డింగులో చేరారు. బోర్డింగులో వున్న 60 మందిగాక ఊళ్ళోనుండి 50-60 మంది హరిజన బాలికలుగాని, ఇతరులుగాని బడికి వచ్చుచుండెడివారు, మాబడిలో 5 తరగతులవరకే చదువు. పైచదువులకు మా విద్యార్థులను ఏపట్టణానికైనా పంపించవలసి యుండెను. అక్కడ హిందూ హరిజన బాలురకు బోర్డింగు వసతి ఉండెదికాదు. అందువల్ల మా ఆశ్రమమును గుంటూరుకు మార్చుట అనివార్యమైనది.

ఈ హాస్టలులో చేరిన పిల్లలందరకూ తలలు నున్నగా గొరిగించి పిలకలు పెట్టించి వారందరూ సూర్యోదయానికి పూర్వమే దినచర్య, కాలకృత్యములు ముగించుకొని కృష్ణ కాలువలో స్నానములుచేసి ఊర్ధ్వపుండ్రములు ధరించి రామనామ భజనచేసి జావ త్రాగి తరగతులకు హాజరయ్యేవారు. కాలవకట్టన నడచిపోయెడి బాటసారులు అనేకులు మా ఆశ్రమ విద్యార్థులనుచూచి ఆ పిల్లలంతా వైష్ణవపిల్లలని భ్రమచెందెడివారు. కొండా వేంకటప్పయ్యపంతులుగారు, శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు ఆశ్రమమునకువచ్చి విద్యార్థులను చూచి ఆనందపరవశులైనారు.

నాకు చిన్నతనమునుండీ యెవరికి యేపని చేసిపెట్టినా ప్రతిఫలం కోరటం యెంతమాత్రం గిట్టేదికాదు. నేను చదువు చాలించి మంగళగిరిలో నున్న సమయములో పోస్టుమాస్టరు స్నేహంవల్ల యెక్కువకాలం పోస్టాఫీసులో గడపెడివాడను. అక్కడకు ఉత్తరాలు, మనిఆర్డర్లు వ్రాయించుకొనుటకుగాను చాలామంది వస్తూఉండేవాళ్ళు. వ్రాసినందుకు నాకు ప్రతిఫలంగా అణా బేడ యివ్వజూచేవారు. కాని నేను అంగీకరించేవాణ్ణికాను. నాకు చిన్నతనములోనే సేవాధర్మము అలవడినదనుటకు ఇదొక మచ్చుతునక.

నేను 15_16 సంవత్సరాల వయస్సు వాడనై యుండగా నాకు జబ్బుచేసింది. అప్పుడు మాఊరి పోస్టుమాస్టరుగారి తండ్రి సలహానుసరించి తొట్టి స్నానం చేశాను. ఆరోగ్యం కలిగింది. అప్పటికి మనదేశంలో తొట్టి స్నానాల గురించి బహు స్వల్పంగా తెలుసును. నాకు సలహా చెప్పినవారికికూడా బాగా తెలియదు. శ్రీ గంధం కృష్ణారావుగారు మదరాసులా కాలేజీలో చదువుకొనుచున్నారు. వారు ఉబ్బసం వ్యాధితో బాధపడుతూ జర్మనీ దేశస్థుడు డాక్టర్ కూనే గారు వ్రాసిన గ్రంథమును చదివి దానిలో చెప్పిన ప్రకారం ఆచరించి సంపూర్ణారోగ్యమును పొందగలిగినారు. వారి ద్వారా మనదేశంలో తొట్టి వైద్యం వ్యాప్తి నందినది. అంతకు ముందే ద్రోణంరాజు రామమూర్తిగారు కూనేగారి గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. అయినా ఆ గ్రంథమంత వ్యాప్తిలోకి రాలేదు. నేను కృష్ణారావు గారికి ఉత్తరములు వ్రాసి, వారివల్లను, గుంటూరులో నున్న స్నేహితుల

వల్లను ఆ వైద్యమును గురించి యెక్కువగా తెలుసుకో గలి గాను. అప్పటి నుండి ఇప్పటివరకూ యెవరికి యే జబ్బుచేసినా ప్రకృతి వైద్యము తప్ప మందులూ మాకులూ పుచ్చుకో లేదు. ప్రకృతి వైద్యమును, పథ్యపానములను గురించిన గ్రంథములు అనేకము చూచాను. తొట్టి—నీళ్లు—స్నానము అనే పెద్దగొడవ లేకుండా కేవలమూ ఆహార వ్యాయామ నియమము లవలంబించి, యేరోగమునైనా నయము చేసుకోవచ్చు నని గ్రహించాను. ఆ విధంగా నాకు వచ్చిన రోగములను నయము చేసుకున్నాను.

నేను క్రొత్తగా పెదపాలెము వెళ్ళే రోజులలో (1916) కమ్మవారి ఇళ్ళలో ఘోషా పద్ధతి అమలులో ఉండేది. ప్రతి ఇంటిలోనూ ఒక తెర ఉండేది. పరపురుషులతో స్త్రీలు ఆ తెరచాటున ఉండి మాట్లాడేవాళ్ళు. 70, 80 వళ్ళ ముస లమ్మలుకూడ పరపురుషు డెదురుపడితే ప్రక్కకు సందు గొందులలో దూరేవారు. దాక్కొనేవారు. స్త్రీలలో విద్య, స్వేచ్ఛ, విధంతు వివాహములు వ్యాపించవలెనని కోరే నాకు యీ పద్ధతి వింతగా కనపడెడిది. నన్ను చూచి సందు గొం దులు దూరే పండు ముసలమ్మలతో "అమ్మా! మీకు నేను మనుమని వంటివాణ్ణి. నన్ను జూచి యెందుకమ్మా దాగుదు మూతలాడుతారు!" అనేవాణ్ణి, పాపమువారు నవ్వుకునేవారు. ఏమి చేయగలరు!. అది పరంపరగా వస్తున్న సాంఘికాచార మయ్యె. నేను ఆ గ్రామములో ప్రవేశించిన తరువాత యీ దురాచారము క్రమక్రమముగా సడలిపోయినది. తరువాత నా యెదుట వారు ఘోషా పాటించేవారు కారు. "మీరు

వచ్చిన తరువాత మాకు కొంత స్వేచ్ఛ కలిగినది." అని వారు నాతో చెప్పుకొని సంతోషపడేవారు.

1917వ సంవత్సరములో జనవరి నెలలో జరిగిన ముక్కోటి ఏకాదశి ఉత్సవమునకు శ్రీ సీతారామయ్యగారి ఇంటి స్త్రీలు, వారి బంధువులు చాలామంది మంగళగిరి దేవాలయమునకు వచ్చి దేవాలయమునకు ఉత్తరముగానున్న పేరకలపూడివారి సత్రములో బసచేశారు. దశమిరోజు రాత్రి నేను దేవాలయముగదిలో స్థాపించిన గ్రంథాలయములో నిద్రించి, తెల్లవారుజామున లేచి సత్రమునకు పోవుచుండగా త్రోవలో నాకొక బంగారు గొలుసు దొరికినది. విచారించగా అది శ్రీ సీతారామయ్యగారి భార్యదని తేలింది. అది వారికిచ్చి వేసితిని. ఆమె "అయ్యా! హనుమంతరావుగారూ గొలుసు మీకు దొరకబట్టి యీ రోజు నా ప్రాణాలు దక్కినవి. లేకపోతే నాగతియేమయ్యేడిదో!" అని గోలపెట్టినది. పుత్తుంబాకవారి యింట్లో స్త్రీలు, పురుషులుకూడ నన్నెంతో మంచిమిగానే ఆదరించేవారు. శ్రీ నరసయ్యగారు ఏదో పనిమీద మంగళగిరివచ్చినప్పుడు ప్రసంగవశమున మా నాయనగారితో "మేము ఇదివరకు ముగ్గు రన్నదమ్ములము. ఇప్పుడు శ్రీ హనుమంతరావుగారితో నలుగురమైనాము" అన్నారు. మానాయన ఆనందపరవశుడైనాడు. వారి ఇళ్లలోని స్త్రీ పురుషులందరూ నాయందు అటువంటి ఆదరాభిమానములను చూపువారు. పోయినవారుపోగా మిగిలినవారు ఇప్పటికీ నన్ను అలాగే చూస్తారు.

నాకు వివాహము 1919వ సంవత్సరములో తెనాలి తాలూకా శిరిపూడిలో జరిగినది. మద్దాలివారి ఆడబడుచు కనకదుర్గాంబను నేను వివాహమాడినాను. నా మామగారు భూవసతి కలవారు. నైజాం ఇలాకా జటప్రోలు సంస్థానములో పోలీసు ఇన్‌స్పెక్టరు ఉద్యోగం చేసి రిటైరయినారు. పేరు మద్దాలి పురుషోత్తమరావుగారు. నాకు 5 గురు బావమరదులు, ఒక వదినెగారు ఉండేవారు. శ్రీనివాస శిరోమణి అనే కరణం శ్రీనివాసరావు నాకు షడ్డకుడు. మాది మామూలు లాంఛన ప్రాయముగా జరిగిన సంప్రదాయపు వివాహమే. మా బావమరదులలో పెద్దవాడు ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. రెండవవాడు జటప్రోలు రాణీగారివద్ద పి. ఏ. గా పనిచేశాడు. ఆమె తదనంతరం రాజు గారివద్దనే పి. ఏ. గా పనిచేశాడు. పెద్దవారిద్దరూ చని పోయారు. మూడవవాడిని కృష్ణాశ్రమములో గుమాస్తాగా వేసుకున్నాను. తరువాతవాడు ఖాదీ డిపార్టుమెంటులో ఉద్యోగిగాచేరి పనిచేశాడు. నాలుగవ బావమరది సెకండరీ గ్రేడ్ ట్రైన్డ్ టీచరుగా పనిచేసి పింఛను తీసుకున్నాడు. 3-4 బావమరదులు నర్సరావుపేటలో స్థిరపడిపోయారు. నా బావమరదులందరూ ప్రయోజకులూ, యోగ్యులు. అయిదవ వాడు డి. పి. డబ్లయు.లో పనిచేసి రిటైరయినాడు. ఇతనూ నర్సరావుపేటలోనే స్థిరపడిపోయాడు.

నేను మొదట కృష్ణాశ్రమము స్థాపించుటకు పూర్వము 4-5 వందల ఎకరముల భూమిని సంపాదించి, దానిలో హరిజన కాలనీ, విద్యా సంస్థలూ స్థాపించవలెనని సంకల్పించాను.

1919లో ఆ సంకల్పం సిద్ధించే అవకాశం యేర్పడ్డది. అప్పుడు గుంటూరు జిల్లాకు కలెక్టరుగానున్న హిల్‌డొరగారు హరిజనోద్ధరణకు పాటుబడుతున్న హిందూసంఘ మేదైనాఉంటే మంగళగిరి సమీపమునందలి కురగల్లు గ్రామములోని 3, 4 వందల ఎకరముల భూమి పట్టాయిద్దాము. కనుక్కొని తెలుపవలసిందిగా గుంటూరు ఆర్. డి. వో. గా పనిచేయుచున్న శ్రీ గుండూరావుగారిపేర ఒక జాబు వ్రాశారు. వారు నాకు యీ విషయాన్ని తెలియపరచారు. నేను దానికి అంగీకరించాను. నేను గుండూరావుగారు కలిసి రెండుపర్యాయములు కురగల్లువెళ్లి ఆ భూమినిచూచి ఆశ్రమస్థాపనకు అనువైన స్థల నిర్ణయము కూడా చేసివచ్చాము. ఈప్రయత్నము జరుగుతూ ఉండగా 1920 అసహాయోద్యమం ఉధృతముగా ప్రారంభమైనది. నాలోనున్న జాతీయభావములు భూమిని స్వీకరించుటకు అంగీకరించలేదు. ఆ విషయం గుండూరావుగారికి తెలియపరచాను. వారికి నా మీద వల్లమాలిన కోపం వచ్చింది.

శ్రీకృష్ణాశ్రమం అభివృద్ధి విషయములో ఇతర పనులకు అప్పుడు జిల్లా లేబరుఆఫీసరుగా నున్న శ్రీ సింగారువేలు మొదలియార్‌గారు, వారి ఆఫీసు మేనేజరుగా పనిచేయుచున్న శ్రీ భాగవతుల అన్నప్పశాస్త్రిగారు నాకు అనేకవిధముల చేదోడువాదోడుగా ఉంటూవచ్చారు. పుగాకువర్తకులు శ్రీ కోట లక్ష్మయ్యనాయుడుగారు "మీరు డబ్బుకు యేమీ ఇబ్బందిపడవద్దు. ఎప్పుడు ఎంతకావలెనంటే అంతా నావద్ద తీసికొని వెళ్ళండి. గవర్నమెంటునుండి గ్రాంటువస్తే

నాకు తెచ్చియివ్వండి" అంటూ నాకు ధైర్యము చెప్పారు. అలాగేవారు నాకు అండగా నిలిచారు. గుంటూరులో స్థలముకొనుటకు మూడువేలు అప్పుగాయిచ్చారు. మూడు వేలు వారు అప్పుగా యిచ్చినపుడు తమకు వడ్డీఆశ లేదనియు అసలుమాత్రం తిరిగియిస్తే చాలుననియు చెప్పారు. నోటు కూడా వ్రాయమని కోరలేదు. కాని నన్ను యింతగా నమ్మి యిస్తున్న యీ పెద్దమనిషికి తిరిగి తీర్చగలమో లేదో నన్న భయముతో నేనే గుంటూరులో కొన్న 5 ఎకరాల భూమి, పెదపాలెములోని బిల్డింగుతోసహా ఎకరముభూమిని కొద్దివడ్డీకి వారి పేర తాకట్టు దస్తావేజు వ్రాయించి, క్రయదస్తావేజు, తాకట్టు దస్తావేజు రెండూ ఒక్కనాడే రిజిష్టరు చేయించాను.

గుంటూరులో పొగాకు వ్యాపారస్థులైన శ్రీ కోట లక్ష్మయ్య నాయుడుగారివద్ద తీసికొన్న మూడువేల రూపాయలకుతోడు అప్పుగా తీసికొన్న వేయిరూపాయలు కలిపి నాలుగువేల రూపాయలతో జూట్ మిల్లువద్ద అయిదు ఎకరముల పొలమును కొన్నాను. మంచి ఉత్సాహముతో ఆశ్రమమును, పాఠశాలను నిర్వహించి నడపుతున్నాను. శ్రీకొండా వేంకటప్పయ్య పంతులుగారు తిలక్ స్వరాజ్యనిధినుంచి అయిదువేల రూపాయలు సహాయము చేయించారు. కృష్ణాశ్రమమునకు ఈనిధితో పెదపాలెంలో ఒక భవనమును కట్టించుటకు ఆశ్రమ నిర్వహణకు ఖర్చుపెట్టగా, ఒక వెయ్యి రూపాయలు మాత్రము మిగిలిఉన్నవి.

నాకు తెచ్చియివ్వండి" అంటూ నాకు ధైర్యము చెప్పారు. అలాగేవారు నాకు అండగా నిలిచారు. గుంటూరులో స్థలముకొనుటకు మూడువేలు అప్పుగాయిచ్చారు. మూడు వేలు వారు అప్పుగా యిచ్చినపుడు తమకు వడ్డీఆశ లేదనియు అసలుమాత్రం తిరిగియిస్తే చాలుననియు చెప్పారు. నోటు కూడా వ్రాయమని కోరలేదు. కాని నన్ను యింతగా నమ్మి యిస్తున్న యీ పెద్దమనిషికి తిరిగి తీర్చగలమో లేదో నన్న భయముతో నేనే గుంటూరులో కొన్న 5 ఎకరాల భూమి, పెదపాలెములోని బిల్డింగుతోసహా ఎకరముభూమిని కొద్దివడ్డీకి వారి పేర తాకట్టు దస్తావేజు వ్రాయించి, క్రయదస్తావేజు, తాకట్టు దస్తావేజు రెండూ ఒక్కనాడే రిజిష్టరు చేయించాను.

గుంటూరులో పొగాకు వ్యాపారస్తులైన శ్రీ కోట లక్ష్మయ్య నాయుడుగారివద్ద తీసికొన్న మూడు వేల రూపాయలకుతోడు అప్పుగా తీసికొన్న వేయిరూపాయలు కలిపి నాలుగువేల రూపాయలతో జూట్ మిల్లువద్ద అయిదు ఎకరముల పొలమును కొన్నాను. మంచి ఉత్సాహముతో ఆశ్రమమును, పాఠశాలను నిర్వహించి నడపుతున్నాను. శ్రీ కొండా వేంకటప్పయ్య పంతులుగారు తిలక్ స్వరాజ్యనిధినుండి అయిదువేల రూపాయలు సహాయము చేయించారు. కృష్ణాశ్రమమునకు ఈనిధితో పెదపాలెంలో ఒక భవనమును కట్టించుటకు ఆశ్రమ నిర్వహణకు ఖర్చుపెట్టగా, ఒక వెయ్యి రూపాయలు మాత్రము మిగిలిఉన్నవి.

యిచ్చారు. ఆ మొత్తమును నేను తీసుకోనకుండా ఆశ్రమం కాతాకు జమకట్టించాను.

నేను ఉత్తరాది యాత్రలకు వెళ్ళినప్పుడు ఢిల్లీలో శ్రీ శ్రీ శ్రద్ధానందస్వామివారి దర్శనముచేసికొని, వారు స్థాపించిన కాంగ్రీ గురుకులం చూచేభాగ్యం కలిగింది. స్వామివారు మాయందుచూపిన ఆదరణకు ముగ్ధులమైనాము. తరువాత మేము సబర్మతీఆశ్రమమునకు వెళ్ళినప్పుడు గాంధీమహాత్ములవారు జలియన్ వాలా బాగ్ దురంతములను గురించి విచారించుటకు వెళ్ళియున్నందున వారువచ్చేవరకూ అక్కడ మూడురోజులుఉండి వారిదర్శనము చేసుకొని, వారితోను వారి అనుచరులతోను హరిజనోద్యమమును గురించి మాట్లాడటము తటస్థించినది.

పూనాలో మేము సరాసరి లోకమాన్య బాలగంగాధర తిలక్ మహారాజ్‌గారి ఇంటికే వెళ్ళాము. అప్పుడువారు అమెరికానుండి వస్తున్న శ్రీ లాలా లజపతిరాయ్‌గారిని ఆహ్వానించుటకు బొంబాయి వెళ్ళియున్నారు. వారి మేనల్లుడు మమ్మ చాలా మర్యాదచేసి వారిఇంట్లోనే భోజనము చేయుమని బలవంతము చేశారు. కాని మేము అలాచేయక వేరేవంట చేసుకున్నాము. వారిది చాలా పెద్దఆవరణ. దానిలోనే కేసరి, మరాటా పత్రికల అచ్చుఆఫీసులు, సంపాదకీయ కార్యాలయములూ ఉన్నవి.

లోకమాన్యుల స్వంత లైబ్రరీలో కొన్నివేల ఇంగ్లీషు, సంస్కృత గ్రంథములున్నవి. వారు బొంబాయినుండి వచ్చిన రోజున వారిఇంట్లోనే మాకు భోజనము యేర్పాటుచేయిం

చారు. లోకమాన్యులు విశ్రాంతితీసుకొంటున్న మేడమీద గదికి వెళ్ళి నేను వారి దర్శనము చేసుకొన్నాను. అంటరాని తనమును నివారించుటకు మార్గమేమని వారిని ప్రశ్నించాను. అంటరానితనము పోయి హరిజనులు బాగుపడవలెనని కోరే వారు చందాలు వసూలుచేసి దేవాలయములు కట్టించి వానిలోనికి అభిమానముగల అగ్రజాతులవారు హరిజనులు కూడ పోవలెననియు, ఆ దేవాలయములకు వెళ్ళిన అగ్ర జాతులవారు మామూలు దేవాలయములకు కూడ వెళ్ళుతూ ఉండవలెననియు, అలా కొంతకాలము జరిగినతరువాత క్రమ క్రమముగా హరిజనులను మామూలుగుళ్ళకు రానివ్వటము కు ఆటంకము లుండవనియు సెలవిచ్చిరి. వారికి దేశములో అక్కడక్కడా బహుమతులుగా యిచ్చిన వస్తువులు బీరు వాలలో పెట్టి ప్రదర్శించబడుతున్నవి. అతిప్రేమతో ఆదరించి వానిని చూడమనిరి. శ్రీవారి ఆరోగ్యము అప్పటికే శిథిలమై యుండెను. అందువల్ల పూనాపట్టణమునకు వెలుపలనున్న బంగాళాలో కాలక్షేపముచేయుటకు మరునాటి ఉదయము బయలుదేరిరి. బయలుదేరునప్పుడు ఇతరుల సహాయము లేనిదే బండియెక్క లేకపోయిరి. తరువాత చాలా కొద్దిమాస ములలోనే వారు పరమపదించినట్లు పత్రికలలో వార్త చదివి నట్లు జ్ఞాపకము.

1921లో దక్షిణాది యాత్రలకు వెళ్ళినప్పుడు మహా యోగి శ్రీ అరవిందుల దర్శనము చేసుకొంటిని. వారిని నేను పూర్ణయోగమనునది మీరు కనిపెట్టినదా? లేక మనపూర్వ గ్రంథములలో చెప్పబడియున్నదా?" అని ప్రశ్నించితిని.

"మన పూర్వగ్రంథముల నుండి గ్రహించినదే"నని వారు సెలవిచ్చిరి. అంతకన్న వారితో యెక్కువ మాట్లాడ వీలుపడలేదు. మహాపురుషులతో అల్పజ్ఞుడనైన నేను యేమి మాట్లాడగలను? వారి దర్శనమే సర్వసంశయవిచ్ఛేదకము కదా?

1922లో నా భార్య కాపురానికి వచ్చింది. తరువాత కొన్ని నెలలకు మా నాయనగారికి నంజు చూపినది. మంచము నుండి లేవలేనిస్థితి వచ్చినది. అందులో అతిసారము కలిగినది. ఒక్కొక్కప్పుడు మంచములోనే ప్రక్కలో విరేచన మయ్యేడిది. ఆ సమయములో నేనెక్కడికి పోకుండా ఇంటి వద్దనే ఉండి ఆయనకు సేవచేస్తూ ఉన్నాను చేటలో బూడిద పోసి విరేచనమైన తరువాత అది తీసుకువెళ్ళి దూరముగా పారబోసెడివాడను. ప్రక్క గుడ్డలు రోజూ చాకలికివేసి ఉతికించి తెప్పించేవాడిని. మూత్రవిసర్జన చేసినచోటు ఫినైలుతో చక్కగా కడిగి శుభ్రముచేసెడివాడను. వేడినీటితో స్నానము చేయించి తడియార్చి ధౌతమును కట్టబెట్టి సాంబ్రాణి పొగవేసి పరుండబెట్టెడివాడను. భోజనమునకు ఆయన కోరిన పదార్థములు చేయించి పెట్టెడివాడను. ఈ నా సేవకు ఆయన పరవశుడై "నాయనా! పుడితే మళ్ళా నీకడుపునే పుట్టాలిరా!" అని అన్నాడు. ఆ మాటకు నాకు అమితానందము కలిగి, కళ్ళవెంట నాకు తెలియకుండగనే ఆనందబాష్పములు రాలినవి. "నాయనా! నీవు నాకు లక్షరూపాయల ఆస్తిఇచ్చినా సంతోషము కలిగెడిదికాదు" అన్నాను. తరువాత ఆయన కొన్ని రోజులకు పరమపదమునొందినారు. నేను అంటరాని

సేవము పాటించకపోవటంవల్ల శవాన్ని శ్మశానమునకు చేర వేయుటకు వాహకులుగాని, మంత్రము చెప్పుటకు పౌరోహితుడుగాని బ్రాహ్మణు లెవ్వరూ నా చెంతకు రాలేదు. కొలకలూరు నుండి నా మేనమామలు వచ్చారు. ఆ రోజున జరుగవలసిన కర్మకాండ జరుపుటకు, ఉత్తర క్రియలు నెరవేర్చుటకు ఆ గ్రామవాస్తవ్యుడు మా నాన్నగారికి మిత్రుడునైన బ్రాహ్మణుడొకాయన సాహసించివచ్చాడు. ప్రేత మేలు కొరకు గోదానము, అన్నదానము చక్కగా తృప్తిగా చేయించాను. ఆయన చనిపోయిన తరువాత ఇంకా కొంతకాలం బ్రతికి ఉంటే తృప్తితీర సేవచేయు అవకాశం నాకు దక్కేదే, అప్పుడే పోయినాడే అన్న చింత నాకు కలిగినది. ఆయన పోయే ముందు "నాయనా! నేను బ్రతికి గుళ్ళు కట్టిస్తానా!" అని అన్నాడు. దానిని బట్టి ప్రతిజీవి యీలోకంలో నున్నప్పుడు యేవో పుణ్య కార్యాలు చేయాలనే కోరిక ఉంటుందనీ, యేమీ చెయ్యలేక చనిపోయేముందు, అయ్యో! జీవితం నిరర్థకంగా గడిచిపోయిందనే చింత వేధిస్తూ ఉంటుందనీ నేను గ్రహించాను.

నా తండ్రిగారుపోయిన కొంతకాలానికి నా భార్యతో పెదపాలెంలో కాపురం పెట్టవలసి వచ్చింది. నేలూరులో నాకుండుకున్న భూమిమీద వచ్చే ఆయివేజు కొద్ది. అది మాకు చాలేదికాదు. ఆశ్రమం నుండి డబ్బుతీసుకోవడం నాకు ఇష్టంలేదు. ఆ సమయంలో శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు నాకు యేలోటూ కలుగకుండా చూస్తూ ఉండేవారు. ఆశ్రమం నుండి ప్రతిఫలం పొందవచ్చునా

కూడదా అన్న విషయం శ్రీ వేంకటప్పయ్య పంతులు గారితో సంప్రదించాను. తీసుకొనటంలో యేమీ తప్పు లేదని వారు సెలవిచ్చారు. అప్పటి నుండి ఒక పద్ధతి ప్రకారము కొంతడబ్బు తీసుకొనసాగాను.

నా కుటుంబములోని పెద్దలకు నెలకు రు. 15 లు చొప్పున, పిల్లలకు ఒక్కొక్కరికి రు. 5 లు చొప్పున గౌరవ వేతనముగా తీసుకొంటూ వచ్చాను.

శ్రీ వింజమూరి పార్థసారథి అయ్యంగారు కృష్ణాశ్రమమును దర్శించి భారతిలో ఇట్లు వ్రాశారు:

"ఒకనాడు నల్లపాటి హనుమంతరావు గారి ఆహ్వానమును మన్నించి శ్రీ కృష్ణాశ్రమం చూచుటకు బయలుదేరి వెళ్లాను. పెదవడ్లపూడి స్టేషనులో దిగి స్టేషను ప్రక్క రోడ్డు వెంటనడచి రేవేంద్రపాడుకు పోవు బకింగుహాంకాలువదరికి చేరి బల్లకట్టు యెక్కి అవతలివరికి చేరాను. బల్లకట్టునుంచి దిగుతూ ఉంటే వెనుక నుండి యెవరో పెద్దమనిషి 'తాకవావయ్యా నీ ఇల్లు బంగారం కాను' అని పెద్దగా అన్నాడు. 'ఏం తాకుతే!, అన్నాను. ఇంతట్లోకే ఇంకో మనిషి ఇంకొంచెం బిగ్గరగా "ఓహో! స్వామి తెలిప్పు మనుసులు గామాలె!" అంటూ వికటంగా నవ్వనారంభించాడు. ముందుగా దిగుతున్న అంటరాని వాళ్లను రాసుకుంటూనే నేను దిగిపోయినాను. పంచముల దౌర్భాగ్యస్థితి తలపుకు రాగానే దుర్నివారంగా కంట నీళ్లు కారాయి. ఎండలో త్వరగా పెదపాలెం చేరుకుందామని గబగబా నడుస్తున్నాను. మొహం నిండా విభూతి పెండెకట్లు పెట్టుకొని ఏవో కొన్ని మంత్రాలు జపిస్తూ పోతున్న బ్రాహ్మణుడు కలిశాడు. ఆయన నా వంక తిరిగి చూచి, అయ్యా! తమదే ఊరు? అన్నాడు. 'గుంటూరు కొత్తపేట' అన్నాను. ఎక్కడికి వెళ్లుతున్నారు? అన్నాడు. 'పెదపాలెం' అన్నాను. ఎగాదిగా చూచి 'మాలమాదిగాళ్లకు బ్రాహ్మలు చదువు చెప్తున్న చోటికా?' అన్నాడు. 'ఔను' అక్కడికే' అన్నాను. కాసేపు ఊరుకొని తనలో తాను

'వినాశకాలే విపరీత బుద్ధి' అని చివర విసర్గ లోపంతో అనుకుంటున్నాడు. మాలవాళ్లకు మన బ్రాహ్మలు చదువు చెప్పటమేమిటి? మరి మిక్కిలి వాళ్లను తాకడం! రామరామా! ఎటువంటి దురవస్థ పట్టిందండీ మనకుల గోత్రాలకు అని వాపోయాడు.

"నిజమే! తరతరాల నుంచి వస్తూన్న యీ ఆచారాన్ని ఇప్పుడు మార్చి వేయాలంటే శ్రోత్రియులైన బ్రాహ్మలు వేదాలే తప్ప వేరే ఔదార్యం లేనివాళ్లు ఎలా ఒప్పుకుంటారు? ఒక పాఠాన్ని": "అని నేనూ అన్నాను.

'వేదాలలో అక్కడా చండాలురంటే బ్రాహ్మణ స్త్రీకి శూద్రుని వల్ల పుట్టిన వాళ్ళు' అని ఉన్నది. వాళ్లే అంటరాని వాళ్లు. వాళ్లను ముట్టుకున్నందువల్ల కలిగే దోషమూ, ఆ దోషానికి పరిహారమూ అన్నీ శ్రుతిస్మృతులలో వ్రాసి ఉన్నాయి' అన్నాడు. వేదములలో ఎక్కడైన యీపంచములు పేర్కొనబడి ఉన్నారా? అని ప్రశ్నించాను. 'మనవిప్ర చరిత్రంతా యీ రంకుమీదే ఆధారపడి ఉన్నది కదాండీ' అని అన్నాను. అవధాన్లుగారూ! వెనకటికి ఒకకథ జ్ఞాపకానికి వస్తోంది. పూర్వం అదే పూళ్ళోనో ఏకగర్భ వాసాన జన్మించిన అన్నా చెల్లెలూ పసితనంలో దుర దృష్టవశావత్తు కృష్ణలోపడి కొట్టుకొని పోయారట. వాళ్ళనెవరో రక్షించి పెంచుకొని పెద్దవాళ్ళను చేశారట. తర్వాత కొంతకాలానికి అన్నా చెల్లె లకూ వివాహమైనదట. వివాహమయిన దరిమిలా ఆపిల్లలను పెంచుకొన్న వాళ్ళకు పెండ్లి అయిన వాళ్ళిద్దరూ ఒక తల్లిబిడ్డలని తెలిసిందట. అప్పుడు అన్ని శాస్త్రాలు చదువుకొన్న పెద్ద పండితుడు ఒకడు ఒక ఉపాయం చెప్పాడు. 'అన్నా చెల్లెళ్ళకు నల్లటి బట్టలుకట్టి కృష్ణలో పడవేస్తే ఆ నల్ల వస్త్రాలు ఎప్పుడైతే తెల్లబడతాయో అప్పుడు వాళ్లకు పాపపరిహారం అవు తుందనీ' అని. ఆవిధంగానే వాళ్లిద్దరూ జీడిగింజవంటి నల్లటివస్త్రాలు కట్టు కొని కృష్ణలో దిగి భగవత్ప్రార్థన చేసుకొంటూ ప్రవాహంలో పడి కొట్టు కొని పోయినారట. వాళ్ళు ఒకగ్రామం చేరగానే వాళ్ళబట్టలు తెల్లబడి పోయినాయని, అప్పటినుంచీ ఆఊరికి వెల్లటూరు అనిపేరు వచ్చిందని

చెప్పుకుంటారు. మాలవాళ్ళను పాప విముక్తులు చేసేందుకు ఇలాంటిదే ఒకటి ఏ పండితుడన్నా ఆలోచించి ప్రజల మన్ననలకు పాత్రుడై, మా వాళ్ళకు మహోత్కృష్టమైన ఉపకారం చేసి పుణ్యం ఆర్జించరాదూ? అన్నాను.

నా మాటలువిని ఆయన పెదవులు చప్పరించి, నాతో మాట్లాడి లాభం లేదని తప్పుకొని వెళ్ళిపోయారు.

తరువాత నేను శ్రీ కృష్ణాశ్రమం చేరుకొనేటప్పటికి రెండు ఝాములైనది. ఈ ఆశ్రమం స్థాపించినది శ్రీ నల్లపాటి హనుమంతరావు పంతులు గారు. వీరికి ౬౫ సంవత్సరాల ప్రాయముంటుంది. ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. గుంటూరు తాలూకా వారు. మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైనారు. బాల్యకాలం నుంచీ అందులో అసహాయోద్యమం దేశంలో ప్రచారంలోకి రాకముందు నుంచీ గూడ, అనగా 1916 నుండీ, వీరు అధోగతిలోనున్న పంచములను వృద్ధిలోనికి తీసుకొని వచ్చేందుకు బద్ధకంకణులై, నాటి నుంచియు అతిఉత్సాహముతో పనిచేయుచున్నారు. దేశంలో పెద్దపెద్ద పరీక్షల నిచ్చినవారు గూడా మాలవాళ్ళను తాకితే తమ కులగోత్రాలన్నీ పోతాయని చెప్పేరోజులలో వీరు విశేష భాగ్యవంతులు కాకపోయినా ధైర్య సాహసాలతో ఎటువంటి కష్టం వచ్చినా లెక్కచేయక పంచములను పైకి తీసుకొని వచ్చేటందుకు పెదపాలెంలో "శ్రీ కృష్ణాశ్రమాన్ని" ప్రారంభం చేశారు. ఆరోజులలో తమ ఉద్దేశ్యాలను శ్లాఘించి ఆమోదించే వాళ్ళు యెక్కువమంది లేరు. ఒక వేళ ఉన్నా ధన సహాయం చేసేవాళ్ళు అసలేలేరు. అటువంటి దుస్థితిలో కూడా హనుమంతరావుగారు ఏమాత్రం జంకక, అధికప్రయాసలతో యీ ఆశ్రమాన్ని సక్రమంగా నడుపుటకు ఉద్యమించారు. కొందరు బుద్ధిమంతులు వీరిని మాలవాడు అని పిలిచిన రోజులున్నాయి. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు వీరికి 'కాగడా' పత్రికలో 'మాలమాదిగోద్ధారక' అని బిరుదు ప్రదానము చేశారు. ఆ రోజుల్లో కొందరు ఆత్మబంధువులు వీరిని సంఘ బహిష్కారము, కుల బహిష్కారము కూడా చేశారు. ఇన్ని కష్టాలకు లోనైె కూడా ఏమాత్రం

ధైర్యం వదలక నిర్విఘ్నపూర్వకమైన సాహసోత్సాహాలతో తాను విద్యాప్రచారానికి ఏట్టి అంతరాయమూ కలుగనీయకుండా యీనాటి వరకూ సక్రమంగా నడుపుకొంటూ వస్తున్నారు. వీరిని చూడగానే ప్రతివారికి వీరు గొప్ప సద్గుణ సంపన్నులనీ, మిక్కిలి శాంతస్వభావం కలవారనీ తోచక పోదు. నిరాడంబరముగా ఖద్దరు దుస్తులు ధరించి వీరు వీధివెంట వెడుతూ వుండే వీరి ముఖలక్షణాలను చూచిన ప్రతివారికీ వీరియందు సదభిప్రాయం ఏర్పడ కలుగుతుంది. ఆశ్రమమందు వీరు నిరంతర నివాసము వల్ల విద్యార్థులకు అనన్యసహాయులై యుండి వాళ్ళ ఆత్మలలో ప్రేమ, భక్తి, శాంత స్వభావము మొదలగు సద్గుణములతోటి వర్ధిల్ల జేయుచున్నారు.

ప్రపంచములో మనకు అనుభవమున్నంతవరకూ ఏకొద్దిమందో తప్ప ఏదైనా ఒకపనిచేయడానికి శ్లాఘనో, కాకపోతే గౌరవమో అపేక్షించి చేస్తున్నారు. అందులో విశేషంగా యువకులు ఏ సందర్భము వల్లనో తమకు కలిగిన తాత్కాలికోత్సాహమువల్ల ఏదో ఒక గొప్ప కార్యం చేయడానికి పూనుకొని కొంతకాలం పనిచేసిన తరువాత ఉత్సాహం క్షీణించిపోగా అంతవరకూ చేసుకొనివచ్చిన దాన్ని నిష్ఫలం చేసికొంటారు. శ్రీ హనుమంతరావుగారు చేస్తున్నటువంటి సత్కార్యం ఆవిధమైనది ఎంతమాత్రమూ కాదు. అసహాయోద్యమం ఆంధ్రదేశంలో ఉత్సాహం కలిగించిన దానికి రెండు సంవత్సరాలకు ముందే యీ ఆశ్రమాన్ని స్థాపించినారు. రానురాను ఆశ్రమం కొంతమంది దీనబంధువులైన ధర్మాత్ముల ఆదరణానురాగములకు లోనై వృద్ధిపొందుతూ వచ్చింది. 1920 అసహాయోద్యమం విజృంభించిన నాటినుంచీ ఆశ్రమం మరింత వృద్ధిలోకి వచ్చింది. పేరు ప్రతిష్ఠల కోసం యే మాత్రమూ ఏకోశాన ఆశించక పంచములయెడ నిష్కల్మషమైన ప్రేమతో స్థాపించినదీ ఆశ్రమం. అందువల్లకాబోలు నిజమైనటువంటి దేశసేవ, మానవసేవ చేయుచున్న శ్రీ హనుమంతరావుగారి పేరు దేశంలో తగినంత ప్రసిద్ధికి రాలేదు.

స్మృతికారు లేమిచెప్పినా, శ్రోత్రియు లేమిచెప్పినా యీ అంటరానితనము మనదేశానికి మేరలేని కళంకమాపాదిస్తున్నదని చాలామంది

సహృదయులు ఒప్పుకొంటున్న అంశమే. సహజమైన మానవనీతికి విరుద్ధమగు భయంకరమైన దురాచార మీ అంటరానితనము. ఏడుకోట్లమంది స్వదేశీయులను పశువులకంటే హీనంగా చూస్తున్న మన పెద మనసికే ఏ విధంగా అభిమానముంటుందో తోచకుండా ఉన్నది.

పెదపాలెంకు మూడు ఫర్లాంగుల దూరమున ఏ వైపు చూచినా పచ్చని పొలాలతో తోటలతో కన్నులపండువుగా నుంటుంది కృష్ణాశ్రమం చూచుటకు. ఈ ఆశ్రమాన్ని ఆనుకునే కృష్ణకాలువ మనోహరంగా ప్రవహిస్తూ ఉంటుంది. ఈ ఆశ్రమం పూర్వకాలపు ఋషుల ఆశ్రమాలవలె శాంతికి ఉనికిపట్టయి ఉన్నది.

ఆశ్రమ బాలురను చూచిన వాళ్లు, నిమ్నజాతి వాళ్ళలాగా ఏ మాత్రమూ కనపడరు. ప్రాతఃకాలముననే లేని కాల్యాలు తీర్చుకొని వసతి గృహమునకు కావలసిన మంచి తీర్థమును చేరబోసుకొని వంతుల ప్రకారం పనులన్నీ నిర్వహించు కొంటారు. ఆరుగంటల ప్రాంతాల రెండు వేళలా స్నానం చేసి ఉతికి ఆరవేసుకున్న బట్టలు కట్టుకొని అంతా కూర్చుని దైవప్రార్థన చేసుకుంటారు. అటుపిమ్మట చదువుల కుపక్రమిస్తారు. నియమిత కాలములో విద్యార్థులూ విద్యార్థినులూ నూలువడుకుతారు. ప్రస్తుతము యీ ఆశ్రమములో 30 మంది బాలురకు ఉచితముగా భోజనముపెట్టి విద్యగరపుతున్నారు.

ఆశ్రమ ఉద్దేశాలు:-

1. ప్రస్తుతం పంచములనే వారికి భోజనవసతు లేర్పరచి విద్య, చేతి పనులు ఉచితముగా నేర్పడం.
2. ఇతర గ్రామములలో పాఠశాల లేర్పడడం.
3. పంచములయందు లోకులకున్న దురభిప్రాయములు తొలగించడం
4. పంచములు మతాంతరులు కాకుండా చూడటం.

ఈ ఆశ్రమానికి మహాత్మాగాంధిగారి సిఫారసువల్ల, కొండా వేంకటప్పయ్య గారి కృషివల్ల తిలకు స్వరాజ్యనిధి నుండి 5000 రూపా

యలు విరాళముగా ఇచ్చారు. గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘమువారు ఏడువందలు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు అయిదువందలు రూపాయలు ఆశ్రమమునకు వరుసగా విరాళముగా యిచ్చారు. పుతుండాక వారు యిచ్చిన స్థలములో ఆరువేలరూపాయలతో ఒక భవనమును నిర్మాణము చేశాను. ఈ ఆశ్రమాన్ని అభిమానించి సర్వవిధముల తోడ్పడి యీ ఉద్యమాన్ని పెంపొందింప చేసే భారం ఆంధ్ర దేశీయులపై నున్నది.

(భారతి 1925 ఏప్రిల్ సంచిక)

1926వ సంవత్సరములో శ్రీకృష్ణాశ్రమమును పెదపాలెము నుండి గుంటూరులో కొన్న స్థలములోనికి మార్చాను. మార్చుటము అనివార్యమయిపోయినది. పెదపాలెము మారుమూల పల్లెకావడంవల్ల, ఎక్కువ మంది విద్యార్థులకు బోర్డింగు సౌకర్యములు సమకూర్చలేనందువల్ల, హైస్కూలు క్లాసుల సౌకర్యము లేనందువల్ల గుంటూరుకు మార్చవలసి వచ్చింది.

గుంటూరు పాఠశాలలో బోర్డింగులో వందమంది విద్యార్థులకు వసతి కల్పించాము. షుమారుగా పదిమంది వరకూ ఉపాధ్యాయులు పనిచేయుచుండిరి. బోర్డింగులోని పిల్లలుగాని, బైటనుండి వచ్చే పిల్లలుగాని రెండువందలమంది చదువుకొనుచున్నారు. గవర్నమెంటువారు బోర్డింగు గ్రాంటు క్రింద సాలుకు నాలుగువేల రూపాయలు, టీచింగు గ్రాంటు క్రింద 12వందలరూపాయలు యిస్తూఉన్నారు. ఇవియేమూలలకు చాలక దాదాపు 5-6 వేలు నేను తిరిగి చందాలుగా వసూలు చేసినాను. అక్కడ భూమికొన్నప్పుడు, తరువాత బోర్డింగు గ్రాంటు హెచ్చించుటకు, ఇంకా ఆశ్రమాభివృద్ధి విషయ

ములో ఇతర పనులకు అప్పటి జిల్లాలేబరు ఆఫీసరు నాకు బాగా తోడ్పడినాడు.

కృష్ణాశ్రమమును గుంటూరుకు మార్చిన కొద్దిరోజుల తరువాత నాకు అనేకవిధముల తోడ్పడిన ప్రగాఢ వర్తక శిఖామణులు శ్రీ కోటలక్ష్మయ్యనాయుడుగారు చనిపోయిరి. అప్పటికి మాబాకీ తీరలేదు. కాని నాయుడుగారు ధర్మకార్యములకు ఒకలక్ష, తమ ముఖ్యస్నేహితులకు బంధువులకు కొంతకొంత ధనము చెందవలెనని ఒకస్నేహితుని, కొందరు ఆత్మబంధువులను ఎగ్జిక్యూటర్లుగా యేర్పాటుచేస్తూ ఒక వీల్‌నామా వ్రాసి పోయినారు. ఎగ్జిక్యూటర్లలో అభిప్రాయ భేదమేర్పడి కోర్టుకెక్కారు. మద్రాసు హైకోర్టువారు రిసీవరును నియమించారు, ఆయన మేము ఇవ్వవలసిన పైకమునకు మాపై వ్యాజ్యము దాఖలుచేశాడు. భూమికొన్నప్పుడు తీసికొన్నదీ, తరువాత చేబదుళ్ళుగా తీసికొన్నదీ, కోర్టు ఖర్చులూ వగైరాలు అన్నీకలసి రు. 5600 లుకు మామీద డిక్రీఅయినది. ఈలోపల నేను మద్రాసువెళ్ళి నాయుడుగారి అల్లునితోను, రిసీవరుగారితోను సంప్రదించాను. వారు "మీరేమీ భయపడవద్దు. ధర్మకార్యములకు వ్రాసి నధనము క్రింద మీబాకీ రద్దుచేసి, ఆశ్రమం భూమి ఆశ్రమమున కుండునట్లు చేస్తామని హామీయిచ్చారు. ఈ వ్యవహారము పూర్తి చేయు సమయములో దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి సహాయము నర్థించి వారిని మదరాసునకు తీసికొని వెళ్ళినాను. వారు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర

రావుపంతులుగారితో ఆలోచించారు. అందరమూ కలసి రిసీవరు రామచంద్రయ్యగారి సీనియర్ వకీలు దొరస్వామిఅయ్యంగారివద్దకు వెళ్ళి మాట్లాడితే పరిష్కారమౌతుందని నిశ్చయించి అలాచేశాము.

గుంటూరునందలి ఆశ్రమం స్థలమునకు పదివేలు ధర కట్టి దానిని శ్రీ లక్ష్మయ్యనాయుడుగారి ధర్మములనుండి వారు ధర్మముగా ఇచ్చువట్లు యేర్పాట్లుచేశారు. ఆవిధముగా ఆశ్రమస్థలము ఆశ్రమమునకే ఉండిపోయినది.

నేను గుంటూరులో బ్రాడీపేట చివరలో చాలా చౌకగా 1200 గజముల స్థలమును కొన్నాను. కోఆపరేటివ్ సొసైటీలో అప్పుతీసికొని ఒక నివాసగృహమును నిర్మాణం చేసుకున్నాను.

శ్రీ తల్లావఝల శివశంకరశాస్త్రి భట్టాచార్యుల వారు ప్రసిద్ధికెక్కిన పండితుడు, కవి. ఐదారుభాషలలో పాండిత్యము కలవాడు. మంగళగిరిప్రక్కనఉన్న కాజ గ్రామమువాడు. ఆయన తరుచు మంగళగిరిలో ఉంటూ ఉండేవాడు. ఉభయులముకలసి కాంగ్రెస్‌లో పనిచేశాము. ఆయన నిరుద్యోగిగా ఉండేవాడు. శ్రీకృష్ణాశ్రమింలో ఉపాధ్యాయ వృత్తి స్వీకరించవలెననే అభిప్రాయాన్ని వెల్లడించాడు. తరువాత ఆయనను ఉపాధ్యాయుడుగా నియమించాను. చాలా కొద్దికాలానికే ఒకపెద్ద దుమారాన్ని లేవదీశాడు. అది గోబెల్సుప్రచారంవలెనే వ్యాపించిపోయింది. దానితో బజారులో కనుపించిన ప్రతివ్యక్తి సమాధానం కోరుతూ ప్రశ్నించనారంభించాడు. "హనుమంతరావు ఆశ్రమ

నిధులన్నీ హరించి దుర్వినియోగం చేస్తున్నాడు. తనస్వార్థానికే ఉపయోగించుకొంటున్నాడు. ఈ నిధులతో ఒకఇల్లు కట్టించుకొన్నాడు.” అంటూ ఆప్రచారం సాగింది. ఇదినాకు చాలా తలనొప్పిని కలుగజేసింది. శ్రీకృష్ణాశ్రమం కమిటీకి అధ్యక్షులుగా శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారున్నారు. వారు ఒకరోజున నన్ను ప్రశ్నించారు. “ఆశ్రమంనిధులనుండి మీరు కొంత మొత్తమును స్వంతానికి తీసుకొంటున్నారుకదా? దానికి తీర్మానము ఉన్నదా? ఎంత తీసుకొంటున్నారు?” అని ప్రశ్నించారు. “తీర్మానములేదు. కొండ వెంకటప్పయ్యపంతులుగారితో చెప్పగా వారే ఇల్లా తీసుకొనుటకు అనుజ్ఞయిచ్చారు. అప్పటినుండి క్రిందివిధంగా తీసికొంటున్నాను. నాకుటుంబములో పెద్దలైన నా భార్య, నేను చెరొక రు. 15లు చొప్పున రు. 30. నలుగురు పిల్లలకు రు 5 లు చొప్పున రు. 20 లు మొత్తం రు.50లుతీసికొంటున్నాను” అని చెప్పాను. తరువాత లక్ష్మీనారాయణగారు కమిటీ సమావేశమును పిలచి ఆసమావేశంలో నేను వాడుకొన్న మొత్తాన్ని ర్యాటిఫై చేస్తూ తీర్మానమును వ్యాసుచేయించారు. ఆతీర్మానము ఏకగ్రీవముగా అంగీకరించబడింది. తరువాత లెక్కలన్నీ ఆడిట్ చేయించి, ఆడిట్ రిపోర్టును సర్వసభ్య సమావేశంలో ప్రతిపాదించాను. ఆడిట్ రిపోర్టును ఏకగ్రీవంగా అంగీకరిస్తూ తీర్మానం చేశారు.

1930 వ సంవత్సరములో ఉప్పుసత్యాగ్రహములో పాల్గొన్నాను. ఉప్పుసత్యాగ్రహము శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారి ఇంటి ఆవరణలో చేశాను. కాని ఆనాడు అరెసు

చేయలేదు. 7, 8 నుంచి బయలుదేరి నంబూరు స్టేషను వద్ద నున్న కంతేరు గ్రామం వెళ్లి తాటిచెట్లకు కట్టియున్న కల్లు లొట్టెలు పగుల గొట్టించినాము. ఆకారణంగా మమ్మ అరెస్టు చేసి మంగళగిరి సబ్ జైలులో పెట్టారు. తరువాత సబ్ మ్యాజిస్ట్రేటు విచారించి 9 నెలలు కఠినశిక్ష చెప్పాడు. వెంటనే ఆ మరునాడు నన్ను రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపారు. ఒక నెల తరువాత మదరాసు పెనిటెన్షియరీకి మార్చారు. అక్కడ రెండు నెలలు గడిపాను. తరువాత నాకు బి క్లాసు యిచ్చి వెంటనే రాయవెల్లూరు జైలుకు మార్చారు. అక్కడనే శిక్ష పూర్తిచేసుకున్నాను. రాయవెల్లూరు జైలులో శిక్షాకాలం చాలా కులాసాగా గడచిపోయింది. రోజూ గ్రంథపఠనము, సాయంకాలం జైలు ఆవరణలో షికారు తిరగటమూ వగైరా వ్యాపకాలతో కాలక్షేపం జరిగింది. షికారు తిరిగేటప్పుడు మాతో పురాణం సూరిశాస్త్రిగారు కూడా వచ్చేవారు. వారు అనేక శాస్త్రవిషయాలు సైంటిఫిక్ గా ఋజువు చేస్తూ చెప్పేవారు. అప్పుడా జైలులో శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు, డాక్టర్ పట్టాభిగారు, ముట్నూరు కృష్ణారావుగారు, శ్రీ సి. రాజగోపాలాచారిగారు, శ్రీ గోపాలరెడ్డి వగైరా ఎందరో నాయకులు, ఉపనాయకులు ఉంటూఉండేవారు. అందరి వద్దా రకరకాల పుస్తకాలు కోకొల్లలుగా ఉండేవి. అడిగితే యిచ్చేవారు. నేనూ ఒక స్నేహితునితో కలిసి ద్విజేంద్రలాల్ రాయ్ వ్రాసిన హిందీ నాటకాలు చదివేవాడిని. వాసిరెడ్డి పిచ్చయ్యగారనే చేబ్రోలు కమ్మ ఆసామి మాతో ఉన్నారు. వారికి భాగవతం చదివి వినిపించేవాడిని. శ్రీ రామ

కృష్ణ పరమహంస గారి విపులమైన జీవితచరిత్ర ఆరోజులలోనే చదివాను. నేను జైలునుండి వచ్చిన నెలరోజులకు నాకు ప్రథమంగా పుత్రసంతానం కలిగింది. శ్రీ రామకృష్ణ పరమహంస గారి యందు నాకు యేర్పడ్డ గురుభావం, భక్తిభావములకు చిహ్నంగా నా పిల్లవానికి 'రామకృష్ణ' అని పేరుపెట్టుకొన్నాను.

నాకు ఆరుగురు సంతానం కలిగారు. పెద్దపిల్ల 1925లో కలిగింది. విశారద పరీక్ష ప్యాసై, బి. ఏ. ప్యాసైన నా మేనల్లుణ్ణి పెళ్ళిచేసుకొని పదినెలలు కాపురము చేసి, స్ఫోటకము పోసి భర్త ఉద్యోగ స్థలమైన 'జాల్నా' లో చనిపోయింది. మూడవ ఆడపిల్ల 1936లో పుట్టింది. రెండవకుమార్తె 1927లో పుట్టినది. పెద్దకుమారుడు 1931లో జన్మించాడు. యల్. సి. ఇ. ప్యాసైప్రస్తుతం (1975) తెనాలిమునిసిపాలిటీలో టౌన్‌ప్లానింగు ఓవర్సీరుగా ఉద్యోగాన్ని నిర్వహిస్తున్నాడు. రెండవ పిల్లవాడు 1935 లోను, మూడవ పిల్లవాడు 1942 లోను పుట్టారు. ఈ యిద్దరకూ వివాహములై పిల్లాజెల్లలతో నా వద్దనే వున్నారు.

నేను 1930లో ఉప్పు సత్యాగ్రహములో జైలుకు వెళ్ళినప్పుడు కృష్ణాశ్రమం నిర్వహణ అంతా శ్రీ వింజమూరి భావనాచార్లుగారికి అప్పగించినాను. వారు వృద్ధులగుటవల్ల నిర్వహించలేక ఒకక్రైస్తవ ఉపాధ్యాయునకు పెత్తనం అప్పగించారు. నేను జైలునుండి వచ్చిన తరువాత అతనిని ఖాళీ చేయించుటకు ఎంతో శ్రమపడవలసి వచ్చినది. పాఠశాలలో పరిశ్రమలు యేర్పాటుచేయు నిమిత్తము రేకులతో హాలు

నిర్మించవలెనని నేను తయారుచేసి ఉంచిన ఇనుప స్తంభాలు, దూలాలు, రేకులు వగైరా సరుకు అమ్మి, ఆచార్యుల వారు ఆశ్రమానికి అప్పటికి ఉన్న చిల్లరఅప్పులన్నీ తీర్చివేశారు.

నేను జైలులో ఉండగా టాల్‌స్టాయిగ్రవ్రాసిన 'What then must we do' అనే గ్రంథం చదవటం తటస్థించినది. దానిలో ఆయన, లోకంలో శరీరకష్టం చేసి పంటలుపండించే వారికంటే, వారు పండించే పంటను అనుభవించే సోమరిజనం అనేకరెట్లు హెచ్చుగా ఉన్నదనీ, అందువల్ల వారందరినీ పోషించేభారము వ్యవసాయదారుని మీదపడి ఆపెద్ద భారాన్ని భరించలేక అతడు సతమతమౌతూ దారిద్ర్య మనుభవిస్తూ ఉన్నాడనీ, కాళ్ళూ చేతులూ ఆడుతున్న వారంతా రోజుకు మూడుగంటలు పనిచేస్తే లోకంలో దరిద్ర మనేది లేకుండాపోయి అందరకూ కూటికీ గుడ్డకూ లోటు లేకుండా హాయిగా జీవించే వీలుకలుగుతుందనీ వ్రాశాడు. ఈ సిద్ధాంతం నాకు బాగా నచ్చింది. పల్లెటూరుచేరి వ్యవసాయవృత్తిలో ప్రవేశించి జీవించవలెనని కుతూహలం కలిగింది. నాకు నెల్లూరులోనున్న పిత్రార్జితము షుమారు ఎనిమిది ఎకరముల ఆస్తి అప్పటికే కరగిపోయింది. ప్రాతూరు గ్రామములో మాపినతల్లిగారు నాకిచ్చిన జరీబుపొలము సాగుచేసి జీవించదలచాను. 1931లో జైలునుండి విడుదలవై వచ్చినవెంటనే యీ సంగతి మాపినతల్లికి చెప్పగా దాని కామె అంగీకరించలేదు.

శ్రీకృష్ణాశ్రమమును కొండ వెంకటప్పయ్య పంతులు గారు, శ్రీ కోట లక్ష్మయ్యనాయుడుగారి కుమారుడు శ్రీ

వెంకటేశ్వర్లు. శ్రీ మద్ది వేంకటరంగయ్యగార్లతో ఒక ట్రస్టు బోర్డు యేర్పాటుచేసి, నా కార్యదర్శి పదవికి రాజీనామా పెట్టాను. రాజీనామా చేయవద్దని పెద్దలందరూ చాలా ఆప్యాయంగా చెప్పారు. బ్రతిమలాడారు. ఏమైనా నేను విన లేదు. శ్రీ శివశంకరశాస్త్రిగారు చేసిన అల్లరి నన్ను చాలా బాధించింది. శ్రీ కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీ నారాయణగారు చాలా బ్రతిమలాడుతూ చెప్పారు. విన లేదు. చివరకు అతికష్టంమీద రాజీనామాను అంగీకరించారు.

శ్రీ మద్ది వేంకటరంగయ్యగారిని మేనేజింగు ట్రస్టీగా యేర్పాటుచేసి బాధ్యతలన్నీ వారికప్పగించి బయటికి వచ్చి వేశాను. తరువాత నేను అప్పుజేసి కట్టుకున్న ఇంటినికూడా అమ్మివేసి అప్పులు తీర్చి కృష్ణాశ్రమంతో సంబంధంపూర్తిగా వదలుకొని ఇంటికి చేరాను. 1936 వరకూ గుంటూరులోనే కాపురమున్నాను.

నేను కృష్ణాశ్రమంతో సంబంధంవదలుకొని వచ్చిన తరు వాత మద్ది వేంకటరంగయ్యగారు వడ్రంగము, ఇనుపపనులు, సిమెంటుపనులు నేర్పు పారిశ్రామిక పాఠశాలగా దానిని రూపొందించినారు. శ్రీ వేంకటరంగయ్యగారు చనిపోవువరకు వారే దానిని స్వయంగా నిర్వహించారు. అనంతరం మద్ది సుదర్శనం, ఎమ్. ఎల్. పి. గారి యాజమాన్యమున నడుపబడు చున్నది. పూర్వము నాహయాములో హరిజననాయకులను తయారుచేసిన విద్యాసంస్థ ప్రస్తుతము పారిశ్రామికులను మాత్రమే తయారుచేయుచున్నది. ఆశ్రమములో తయారు చేయబడుతున్న పరికరముల అమ్మకమువల్ల చాలాలాభమును

గడిస్తున్నదని విన్నాను. ఆశ్రమముతో సంబంధము తెంచుకొని వెళ్ళిపోవటము శ్రీ వెంకటప్పయ్య పంతులుగారికి సుతరామూ యిష్టములేదు. ఆశ్రమనిర్వహణ విషయములో నాకు యేవిధమైన శ్రమలేకుండా చేస్తామని హామీనిచ్చారు. వారెంత చెప్పినా వినక మూర్ఖించి నేను వదులుకొని బైటకు వచ్చాను.

ఆరోజులలో ఆశ్రమములో చదువుకొన్న విద్యార్థులు చాలామంది పలుచోట్ల హరిజనహాస్టల్సు స్థాపించి, ఇప్పటికిని పనిచేయుచున్నారు. కొందరు వారి సంఘనాయకులుగాను, డాక్టర్లు, కాంపౌండర్లు, ఉపాధ్యాయులుగాను తయారైనారు, ఒక ఉపాధ్యాయుని కుమారుడు ఐ. ఏ. యస్. పరీక్షయందు ఉత్తీర్ణుడై కర్ణాటక రాష్ట్రములో కలెక్టరుగా పనిచేయుచున్నాడు. ఒకరు కాన్‌స్టిట్యుయెంటు ఎసెంబ్లీలో, పార్లమెంటులో, తరువాత ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో మెంబరుగా పనిచేశారు.

1937లో నా పినతల్లి అంగీకారమును పొంది ప్రాతూరులో ప్రవేశించి వ్యవసాయము చేయ నారంభించాను. కాని ఆ రోజులలో వ్యవసాయ సరకుల ధరలు బహుస్వల్పమైనందున జీవనము గడచుటే కష్టమైనది. అలాగే రెండు సంవత్సరాలు ప్రాతూరులో గడిపాను. అప్పటికి నాకు ఐదుగురు పిల్లలు. నాకు ఏదైన పని చూపించమని అఖిలభారత హరిజనసేవక సంఘము వారిపేర వ్రాసుకున్నాను. బెజవాడలో హరిజన బాలికల హాస్టలు నడుపుతున్న శ్రీ వేముల కూర్మయ్యగారు దానితో సంబంధం వదులుకుంటా నంటు

న్నాడు. అక్కడికి వెళ్ళి దాని మేనేజ్‌మెంటు స్వాధీనము లోనికి తీసుకొని మేనేజిచేయవలసినదిగ ఆర్డరు వేశారు. 1939లో కుటుంబ సహితముగా బెజవాడలో ప్రవేశించాను. ఎంత ప్రయత్నించినా కూర్మయ్య హాస్టలు నాకు అప్పగించు నట్లు కనబడలేదు. ఈ విషయము మరల హరిజన సేవకసంఘం వారికి తెలియపరచినాను. వారు నన్ను నెల్లూరు వెళ్ళమని వ్రాశారు. 1940 లో నెల్లూరు వెళ్ళినాను. నెల్లూరుటౌనులో ఒక బాలురహాస్టలు, ఒక బాలికల హాస్టలు, బుచ్చిరెడ్డి పాలెంలో ఒకహాస్టలు, కందుకూరులో ఒకహాస్టలు ఉన్నవి. నెల్లూరులో కాపురముపెట్టి ఆ హాస్టళ్ళ అజమాయిషీచూస్తూ ఆసంవత్సరమంతా అక్కడ గడిపాను.

నాకు పెళ్ళియీడువచ్చిన ఆడపిల్లలు ఇద్దరున్నారు. వాళ్ళకు సంబంధాలుచూచి పెళ్ళిళ్ళు చేయవలసియున్నది. 1941 ప్రారంభములో కుటుంబమును తీసికొని మరల బెజవాడకువచ్చివేశాను. 1943 లో పిల్లలిద్దరకూ పెళ్ళిళ్ళు చేశాను. పెద్దపిల్ల పెళ్ళిచేసిన కొద్దిరోజులకే విస్ఫోటకమువచ్చి మరణించినది. సంబంధము కొరకు తిరిగినంతకాలమైనా కాపురము చేయనందున నాకు చాలా బాధనిపించినది. రెండవ కుమార్తె గుంటూరులో పిల్లలతో సిరిసంపత్తులతో సుఖంగా కాపురం చేస్తున్నది.

1942లో క్విట్ ఇండియా ఉద్యమములో నామిత్రుడు 'సంపత్' అను గుంటూరు నివాసి పాల్గొని పనిచేయు చున్నాడు. ఆయన విధ్వంసక ఉద్యమమునందు (Sabotage) నాయకత్వం వహించి ఉత్తరహిందూస్థానమంతా తిరిగి

ప్రచారంచేశాము. పోలీసులకు దొరకకుండా తిరుగుతున్నాము. ఒకనాడు నాకొక జాబు వ్రాశాను. "కొండపల్లి రైలుస్టేషను ప్రాంతమునగల సత్రమునందు నాసామాను ఉన్నది. మీరు వెళ్ళి ఆసామాను తీసుకరావలయును" అని వ్రాశాను. పోలీసులు ఆయనకొరకు గాలిస్తున్నారు.

నేను కొండపల్లి వెళ్ళాను. ఆసత్రంగది తెరచిచూస్తున్నాను. అప్పుడు అక్కడ ఒకబైరాగి చిలుంపీలుస్తూ కూర్చున్నాడు. నేను తలుపు తెరచినంతలో ఆతడు నన్ను పేరుపెట్టి పిలచి 'మీరు హనుమంతరావుగారు కాదా? అన్నాడు. నేను నిశ్చేష్టుడనైపోయినాను. 'ఔను' అన్నాను. 'అయితే ఒక నిమిషము ఆగండి' అంటూ వెళ్ళి మరొకపోలీసు కానిస్టేబులును తీసుకవచ్చాడు. మిమ్ము అరెస్టుచేశాము అన్నాడు. నాకు ఏమిటా యీతంతు అనిపించినది. నాకువ్రాసిన ఉత్తరమును పోలీసులు పసికట్టి చదివి మరల దానిని యథాప్రకారం పోస్టు చేసినారు. ఆకారణంగా అక్కడ పోలీసుడ్యూటీ వేసినారు. మరల ఆగదికి వాళ్ళే తాళంవేసి నన్ను బెజవాడకు తీసుకొని వచ్చారు. బెజవాడలో రాత్రి 7-30 గంటలకు రైలు దిగాము. సంపత్ ఎక్కడఉన్నాడో చెప్పుమన్నారు. నాకు తెలియదు అన్నాను. 'అబద్ధము. మీకు తెలుసును' అని, సరే మీ యింటికి పోదాం పదమన్నారు. ఇంటివద్దకు వచ్చాము. పోలీసు వాళ్ళే ఇంటితలుపు తట్టి తలుపుతీయమన్నారు. సంపత్తేవచ్చి తలుపు తెరిచాడు. ఇద్దరనూ అరెస్టుచేసి గవర్నరుపేట 2 వ నెం. పోలీసుస్టేషనుకు తీసుకవెళ్ళి ఒక సెల్‌లో పెట్టారు. ఆసెల్ చాలా దుర్వాసనతో కూడియున్నది. భరించలేకపోయి

నాము. అలాగే తెల్లవార్లూ ముక్కుమూసుకొని గడిపాము. ఉదయమున కాలకృత్యాలు తీర్చుకొని కాఫీసేవించి కూర్చున్నాము. అంతలో దామరాజు వేంకటేశ్వరరావుగారు (సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు) వచ్చారు. ఈ విషయం వారికి చెప్పగా, 'మనకుకావలసిన ముద్దాయి మనకు దొరికాడు. మనకు యీ ముసలాయనతో పనేముంది? వీరిని వదలివేయండి' అన్నారు. తరువాత నన్ను వదలివేశారు.

1948 లో బెజవాడలో 'జన్మభూమి' అను దినపత్రికను స్థాపించారు. డాక్టరు పట్టాభిగారికి యీ పత్రికతో సంబంధమున్నది. మోచర్ల కృష్ణమూర్తిగారు, చిత్తర్వు నాగేశ్వరరావుగారు దీనిని మేనేజిచేస్తూ ఉండేవాళ్ళు. డాక్టర్ పట్టాభిగారిని కలుసుకొని వారి సిఫారసువల్ల జన్మభూమిలో నాకు సబ్ ఎడిటర్ ఉద్యోగం లభించింది. నెలకు వందరూపాయలు యిచ్చారు. రెండుసంవత్సరాలు ఆపత్రికలో పని చేశాను. తరువాత మిస్‌మానేజిమెంటువల్ల, నిధులకొరతవల్ల ఆపత్రిక ఆగిపోయింది. తరువాత మరల నిరుద్యోగినై కొంతకాలం ఇన్సూరెన్సు ఏజంటుగాకూడా పనిచేశాను. ఈవిధముగా మధ్యమధ్య నానాబాధలు పడుతూ 1955 వరకూ ఎలాగో కాలంగడిపాను.

నేనుచేసిన హరిజనసేవకు గుర్తుగా 1955 ఆగస్టునుండి గాంధీస్మారకనిధి వారు నెలకు రు. 75-00 లు చొప్పున ఆర్థిక సహాయము చేస్తూవచ్చారు. నా పెద్దకుమారుడు మునిసిపాలిటీలో చిన్నఉద్యోగములో చేరి నెలకు 50రూపాయలు సంపా

దించుచున్నాడు. ఈవిధముగా సంసారపు చిక్కులు లేకుండా కాలము జరిగిపోవుచున్నది.

1958లో ఆంధ్రప్రభుత్వమువారు నాకు బాపట్లవద్ద మూరుకొంపాడులో 5 ఎకరముల మాగాణీభూమికి పట్టా యిచ్చారు. ఇది నేనుచేసిన దేశసేవకు చిహ్నంగా, రాజకీయ బాధితునిగా నిర్ణయించి ఇచ్చారు. ఆభూమిని స్వయముగా సాగుచేసుకొనుటకు నేను సకుటుంబముగా బాపట్లలో కాపురము పెట్టవలసివచ్చింది. మూడుసంవత్సరాలు బాపట్లలో కాపురముండి వ్యవసాయముచేసికొనుచూ కాలము గడపితిని.

తరువాత 1961 ఏప్రియల్ నెలలో ఆ భూమికి మంచి ధర వచ్చిన కారణముగా విక్రయించాను. ఆ ధనముతో ప్రాతూరుకు వచ్చి, అక్కడ దాదాపు 6 1/2 ఎకరాలు మెట్ట భూమిని కొన్నాను. మా పినతల్లియిచ్చిన భూమినికూడా కలుపుకొని మొత్తం 8 ఎకరములు స్వంతసేద్యము చేసుకొంటూ, తదాది ప్రాతూరు గ్రామములో నేనూ, నా పిల్లలు సుఖజీవనము గడుపుతూ కాలక్షేపము చేస్తూ ఉన్నాము. పెద్దపిల్లవాడు మునిసిపాలిటీలో ఉద్యోగము చేయుచు పిల్లా మేకలతో సుఖజీవనము చేయుచున్నాడు. 2, 3 పిల్లవాండ్రు అసమర్థులై చదువుసంధ్యలు అబ్బక నామీదనే ఆధారపడి నా వద్దనే ఉంటున్నారు.

"నిను చింతించుచు పాడుచున్ పొగడుచున్
నీ దివ్య చారిత్రము-
వినుచున్ జాతురుగాక, లోకు లితరాన్వేషణం
బులన్ జాతురే

ఘనదుర్జన్మపరంపరాదళనదక్షంబై మహాయోగివా
గ్వినుతంబైన భవత్పదాంబుజయుగళమున్
విశ్వేశ విశ్వంభరా !!!

నేను చిన్నతనములో "ఇంగర్‌సాల్" మొదలగు నిరీశ్వరవాదుల గ్రంథాలు చదువుట, బ్రహ్మసమాజం, ఆర్యసమాజం సిద్ధాంతములను తెలుసుకొనుటవల్ల విగ్రహారాధన యందు నమ్మకము సడలి, నాలో ఇప్పటికీ కుదుటబడలేదు. అబద్ధమాడరాదు. నడవడి మంచిగా ఉండాలన్న నమ్మకం నాకు చిన్నప్పుడే కుదిరింది. శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానందస్వామివారల బోధలు, భాగవతము, భారత రామాయణముల నిత్యపఠనములవల్ల శ్రీ అరవిందుని ఉత్తరపరా ఉపన్యాసము, భక్తుల జీవితచరిత్రలు, భవన్సు జర్నలు పఠనమువల్ల భగవంతుడు సర్వత్రా వ్యాపించిఉన్నాడన్న నమ్మకము క్రమక్రమముగా నాలో బలపడజొచ్చినది. ఇప్పుడు నాకు భగవదేచ్ఛలేనిదే యేపనీ మానవుడు చేయలేడనీ, వ్యక్తుల జీవితములో లోకవ్యవహారములలో అనుక్షణము జరిగే ప్రతిపనీ ప్రతిమార్పు ఆయన నిర్ణయప్రకారమే జరుగుతున్నదన్న అభిప్రాయము నాలో దృఢపడినది. నేనూ నాది అనేది యేమీలేదు. అంతా నీదే, నీవే అని సర్వస్వము ఆయన పాదపద్మముల కర్పించి జీవించటంతప్ప, మనకు వేరేమార్గములేదు. మంచికలిగినా చెడుకలిగినా ఆయన దయయే.

నిరంతరమూ గ్రంథపఠనము, భగవచ్చింతనము తప్ప నాకు యిప్పుడు మరో పనిలేదు. ఏ గ్రంథమూ లేకపోతే

ఆంధ్రమహాభాగవతమునే మనము చేస్తూ కాలము వెళ్ళ బుచ్చుతాను. అటువంటి అవకాశము నాకు భగవంతుని పరి పూర్ణ అనుగ్రహామువల్లనే కలిగిందని నా విశ్వాసము.

నేను చిన్ననాటనుండీ ప్రకృతి వైద్యానికి సంబంధిం చిన గ్రంథములు చదువుతూ నాకుగాని, నా కుటుంబములో వారికిగాని యెవరికి యే సుస్తీ చేసినా ప్రకృతి చికిత్సలనే చేయుచూ వ్యాధి నివారణచేయటం పరిపాటి అయింది. పండ్లతోను, పూవులతోను, కాయగూరలతోను రోగమును బట్టి చికిత్సచేయుచుండెడివాడను. 45 సంవత్సరముల యీడు గల నా కుమార్తెకు సంభవించిన ఋతుస్రావము అను వ్యాధి వల్ల కడుపులో గుల్మము యేర్పడినది. మూత్రములో మధు మేహాము జబ్బు కలిగింది. ఆహార పానీయములవల్లనే నయము చేయగలిగాను. ఆధునిక వైద్యులకు అసాధ్యములని వదలి వేసే క్యాన్సరు, క్షయ, రక్తపుపోటు,నపుంసకత్వము మొదలగు వ్యాధులను సులభముగా నయము చేయగల్గితిని. నేను చెప్పే పానీయములు ముఖ్యంగా పండ్లరసాలు, కాయ గూరలు, దుంప కూరల రసాలు, పాలు, తేనె, మజ్జిగ. ప్రతిఫలా పేక్ష లేని ఉచిత సలహాలు రోగులకందజేయవలెనని ఇప్పటికీ నా కోరిక. దీనిని భగవత్సేవగా భావిస్తాను. దుఃఖితప్తులగు ప్రాణుల ఆర్తి నివారణకు మించిన సేవ మరియొకటి లేదుకదా! దీనికి కారణం టాల్‌స్టాయి రచించిన గ్రంథములన్నీ చదివి, వాటి ప్రకారం జీవితమును నడుపుకొన వలయునని అభిలాష కలిగినది. వారి ప్రేరణయే నేను సేవాధర్మమును అవలంబించు టకు కారణము.

గాంధి మహాత్ముడు మెల్లిదిగా ఆహారము నములుతూ తింటూ ఉంటే, ఒకరు యెందు కంత సేపు నవులుతారని ప్రశ్నించారు. నేను నూరేళ్ళు బ్రతక తలచాను. కాబట్టి అలా నములుతున్నానని సమాధానం చెప్పారు. కాబట్టి ఆహారం చక్కగా నమలి తినటములో అంత సుగుణమున్నదని గ్రహించవలెను.

ఈ వయస్సులో నేను ఇప్పటికీ 2, 3 మైళ్ళు నడవగలను. ఈ ఓపిక కలిగియుండుటకు చక్కగా నమిలి తినుటయే కారణము. సాధ్యమైనంత వరకు కూరలు యెక్కువగా తినటము, యెంత చలి కాలమైన గదులలో దూరక పంచలో పడుండి, నిర్మలమైన గాలిపీల్చటం ముఖ్యకారణములని నానమ్మకము.

నేను ఉప్పుసత్యాగ్రహమునందు పాల్గొని 9 నెలలు జైలుశిక్ష ననుభవించిన కారణమున భారత ప్రభుత్వమువారు నాకు తామ్రపత్రమును బహూకరించి 1972లో ఆగష్టు 15వ తేదీ నుండి నెలకు రు. 200-00 పింఛను యిస్తున్నారు. నా వయసు ఇప్పుడు 86 సంవత్సరములు. నాకు ఏవిధమైన రుగ్మత లేక ఆరోగ్యవంతుడనై సుఖజీవనమును శాంతముగా గడుపుతూ కాలక్షేపము చేయుచున్నాను.

ఇంతవరకూ వ్రాసిన పిమ్మట లోగడ ముగ్గురు పెద్దలు, మిత్రులు నన్ను గూర్చి వ్రాసిన అభిప్రాయములుండవలెనని గుర్తుకురాగా వానిని వెతికి తీసినాను. వానిని యిచట ఉటంకించుట దోషముకాదని భావించి వాటి నిట చేర్చుచున్నాను.

శ్రీ వి. భాష్యం అయ్యంగారు మద్రాసు గవర్నమెంటు రిటైర్డు హైకోర్టు జడ్జి. వారు హరిజనోద్ధరణ డైరె

క్ర్తరుగా నియమించబడిరి. కొండా వెంకటపయ్యగారు నన్ను శాస్త్ర్యం గారికి పరిచయము చేయుచు దిగువ జాబు వ్రాసిరి.

"నా పాత స్నేహితుడు శ్రీ నల్లపాటి హనుమంతరావుగారిని గురించి నాలుగు ముక్కలు వ్రాయుటకు మీ అనుజ్ఞకోరుచున్నాను. ఉదారాశయ సంపన్నమైన బుద్ధి, గాఢమైనసేవానురక్తి. అచంచలదేశభక్తి, మతపరమగు సువిశాలదృష్టి శ్రీ హనుమంతరావుకు చిన్నతనమందే హరిజనసేవయందు తీవ్రమైన కోరికను కలిగించినవి. గాంధిమహాత్ముడు హరిజనసేవ ప్రారంభించకపూర్వమే శ్రీ హనుమంతరావు హరిజన బాలురకు ఉచిత భోజనసదుపాయములుగల శ్రీకృష్ణాశ్రమము 1917లో స్థాపించినారు పల్లెపట్టున పెదపాలెంలో ప్రారంభించి 1926లో గుంటూరుకు మార్చినారు. తరువాత ఆయన నిర్విరామ కృషివల్ల అఖండ దీక్షాదక్షత వల్ల అది ఒక గొప్ప సంస్థగా వృద్ధి పొందింది. కేవలము హరిజన సేవకుడు మాత్రమే కాదు. మంచి ఉత్సాహ పూరితుడైన కాంగ్రెసువాది కూడాను. ఉప్పుసత్యాగ్రహ సమయములో దేశమునందు పొంగిపొరలిన ఉత్సాహతరంగములలో తలమునకలై దానిలో చేరి తొమ్మిది నెలలు కఠినకారాగార శిక్ష అనుభవించాడు. ఆయనలేని సమయములో కృష్ణాశ్రమము చిక్కులలో పడి మూసివేయ బడినది. దానిని పునరుద్ధరించుటకు ఆయన పడ్డపాట్లు ఇన్నీ - అన్నీకావని అంగీకరించక తప్పదు.

హనుమంతరావుగారి సౌశీల్యము ఇతరులు చూచి నేర్చుకోదగ్గది. ఆయన ఇతర ఉద్యమములకంటే ముఖ్యముగా హరిజనోద్యమమునకే. అంకితమైనాడు.

(సం.) కొండా వెంకటప్పయ్య

నేను నల్లపాటి హనుమంతరావుగారిని 1913 నుండి యెరుగుదును. మొదటి నుండీ ఆయన అత్యుత్తమ శీలసంపన్నుడు. అర్ధశతాబ్దము నుండి తన జీవితమును దేశసేవకు అంకితముచేసి ఆదర్శ ప్రాయమైన ప్రవర్తన కలిగియున్నాడు. పూర్వార్జితమైన ఆస్తి కరిగిపోయినా, స్వార్థము కొఱకు

గాక పరార్థము కొరకే పాటుపడినాడు. అర్ధశతాబ్దమునుండి మనదేశములో దేశభక్తులు అఖండత్యాగము చేయవలసిన అవసరమేర్పడినది. సాంఘిక రాజకీయ రంగములలో పరిపూర్ణత్యాగముచేసిన దేశభక్తులలో హనుమంత రావుగారొకరు. బంగాళా విభజన రోజులనుండి దేశస్వాతంత్ర్యమును సాధించిన గాంధిమహాత్ముని ఉద్యమకాలంవరకు రాజకీయ రంగమున పనిచేస్తూనే, గాంధీమహాత్ముని నిర్మాణ కార్యక్రమములో ప్రథమస్థాన మాక్రమించిన హరిజనోద్ధరణ కార్యక్రమములోకూడా నిమగ్నుడై పని చేశాడు. యువకుడుగా ఉన్నప్పటినుండీ ఆయనచేస్తున్న హరిజనసేవ నాకు స్వయముగా తెలియును. మనదేశములో ఇటువంటి హరిజన సేవకులు బహుఅరుదు. సాంఘికరాజకీయ రంగములేకాక ప్రకృతిచికిత్సారంగములో కూడా వారిసేవ అమోఘమైనది.

(సం.) ఉన్నవ లక్ష్మీనారాయణ

హరిజనోద్ధరణ నిమిత్తం శ్రీ హనుమంతరావు పాతిక సంవత్సర ముల దీర్ఘకాలము నుండి విరామ మెరుగని అనేకమైన పాట్లు పడ్డాడు. ప్రజాసేవకులందరివలెనే ఆయనకూడా దారిద్ర్యానికి గురియై నిరాశా, నిరా ధారములతో క్రుంగిపోవుచున్నాడు. లోకం ఆయన్ని గుర్తించి ఎప్పుడో ప్రోత్సహించవలసి యుండెను. ఇప్పటికైనా మించిపోయినది లేదు. తగిన ప్రోత్సాహమిస్తే ఆయన సేవలు ఉచిత రీతిని గుర్తించినారని చెప్పవచ్చును.

40 సంవత్సరముల విరామమెరుగని, దేశసేవ, అందులోను ముఖ్యంగా హరిజనసేవకు ఫలితముగా ఆయన వృద్ధాప్యంలో ప్రస్తుతం దరిద్ర మనుభవిస్తున్నాడు. ఇప్పుడు గవర్నమెంటువారు ఇటువంటి సందర్భ ములలో సహాయపడుచున్నారు. కనుక హనుమంతరావుకు తగినంత అను కూలముగా తోడ్పడవలసినదిగా హోంమినిష్టరును కోరుచున్నాను.

(సం.) డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య
గవర్నరు, మహారాష్ట్ర స్టేట్.
నాగపురం